# పాలేటి తరగల్లో మల్లి

(మల్లి పాటలు)







రచన:

పి. దుర్గారావు, యం.ఓ.యల్.

దుందుభినామ సంవత్సరము
వసంతము_వైశాఖము
మే నెల _ 1982

సర్వస్వామ్యములు
గ్రంథకర్త

ప్రథమ ముద్రణము
1000 ప్రతులు

మూల్యము
ఐదు రూపాయలు



ముఖచిత్రం
జి. నాగయ్య, M.Sc., B Ed., ఉపాధ్యాయులు

ముద్రణ :
"వెంకటరత్నా"
విజయవాడ_2

ప్రతులకు
పి. దుర్గారావు, యం.ఓ.యల్.,
చెరుకుపల్లి పోస్టు
(వయా) నక్రేకల్, నల్లగొండజిల్లా.

# వినయ వాక్యము

"పాలేటి తరగల్లో-మల్లి" అనే మల్లి పాటలు విషాద గీతికలు. ప్రియా వియోగముతో ఒకానొక రైతు యువకుడు మధుర స్మృతులతో పలవించిన విలాప ప్రలాపములు, కొంత వఱకిది యొక యదార్థ సంఘటన.

తెలంగాణమున నల్లగొండజిల్లాలో పాలేరు అనే ఒక సెలయేఱు అందచందాలతో ప్రవహిస్తూవుంటుంది. ఈ సెలయేఱు మిర్యాలగూడ తాలూకాలోగల తక్కెళ్ళపాడు గ్రామం దగ్గర ముచుకుంద (మూసీ)లో కలుస్తుంది. ఏటికిరువైపులా దారిపొడుగునా ఎన్నో గ్రామాలు. వర్షాలు పడినప్పుడే ఈ యేఱుపరవళ్ళు త్రొక్కుతూ ప్రవహిస్తూవుంటుంది. లేకపోతే సాధారణంగా మోకాలుబంటి నీటితో ఒంపులు తిరుగుతూ ఒయ్యార మొలకబోస్తుంటుంది.

తక్కెళ్ళపాడుకు సమీపమునగల తడకమళ్ళ గ్రామ సమీపమున కృష్ణవేణీ నదీమతల్లి నుండి నిర్మించిన నాగార్జున సాగరము ఎడమ కాలువ ప్రవహిస్తూవుంటుంది. అచ్చట ఎస్కేప్ నిర్మింపబడినది. కాలువలో నీరు అధికమైనపుడు అప్పుడప్పుడు ఆకస్మికంగా నీరు పాలేరులోనికి వదలబడుతూ

ప్రస్తుత కథా విషయము—పాలేరు అవతలి ఒడ్డున
భర్తతోపాటు పనిచేసి, ఇవతలి ఒడ్డున యింటిలో

నున్న పసిపాపకు స్తన్యమివ్వడానికి ఒంటరిగా వెళుతుంది మల్లి. పాలేటిపై ఒంతెన లేనందున మల్లి మోకాలి బంటి నీటిలో నడిచి వెళుతూ వుంటుంది. కృష్ణ కాలువ నీరు ఆక స్మికంగా పాలేరులోనికి వదలడంవలన అప్పటికప్పుడు పాలేరు నిలువెత్తు ధారలతో నిండిపోతుంది.

మల్లి బ్రతుకు పాలేటి తరగల్లో నూతేళ్ళు నిండుతవి. సఖీ వియోగంతో మల్లి భర్త విలపిస్తాడు. ఆ రైతు యువ కుని మనస్సు నీరై—యేత్రై ప్రవహిస్తుంది. ఆ విషాద తరం గాల ధ్వనులే యీ పాలేటి తరగలు, మల్లి పాటలు.

ఈ పాటలలో శ్రీ నండూరివారి ఎంకిపాటల ఛాయలు స్వీకరించబడినవి. కీ. శే. కవిసామ్రాట్ శ్రీ విశ్వనాథవారి కిన్నెరసాని పాటలలో కిన్నెర భర్త పలవించిన ప్రలాపములు, మహాకవి భవభూతి ఉత్తర రామ చరిత్రలో శ్రీరామచంద్ర మూర్తి సీతామహాదేవికై విలపించు విలాపములు అచ్చ టచ్చట స్వీకరింపబడినవి. ఆ మహాకవులందఱికీ భక్తిపూర్వక నమోవాకములు.

ఈ మల్లి పాటలు రసహృదయులకు ఏ మాత్రము రసానందము గలిగించినను ధన్యునిగా భావించుకుందును.

—రచయిత

శ్లో॥ ఏకో రసః కరుణ ఏవ, నిమిత్తభేదా
ద్భిన్నః పృథక్పృథ గివాశ్రయతే వివర్తాన్
ఆవర్త బుద్బుద తరఙ్గమయాన్వికారా
నమ్భో యథా, సలిలమేవ హి తత్సమస్తమ్॥

— మహాకవి భవభూతి.





# మాతృ వందనం

వందనం యిదె వందనం
తెలుగు తల్లికి మా వందనం!
ఆఱుకోట్ల ప్రజలను కనిపెంచిన
అమృతమూర్తి కివె యంజలులు!
వందనం యిదె వందనం!
తెలుగు తల్లికి మా వందనం! ...వందనం

తుంగభద్ర ముచుకుంద గోదావరి
పొంగిపొరలు శ్రీకృష్ణవేణులతో
రంగుమీరు నవధాన్య రాసులతో
రాజిల్లెడి మా అన్నపూర్ణకిదె! ...వందనం

శిల్పచిత్రకళ నాట్య కీతులను
శ్రీకరమౌ బహు తేనె పల్కులను
తియ్యనిరాగము కమ్మని కవితను
తీరుగ నేర్చిన కళామతల్లికి! ...వందనం

దేశభక్తులను త్యాగశీలురను
ధీరుల వీరుల యోగిపుంగవుల
కడుపుచల్లగా కనిపెంచిన మా
కన్న తల్లి శ్రీ ఆంధ్రమాత కిదె! ...వందనం

భారతమాతకు ముద్దుబిడ్డగా
భావి ప్రగతికీ వేగుచుక్కగా
విశ్వశాంతికై వీణను మీటుచు
విమల గీతమును బాడెడి తల్లికి! ...వందనం

# క్రొత్త జగతి

క్రొత్త జగతి వచ్చిందని
కోకిల పాడిందీ!
ముచ్చటగా పువ్వులన్ని
విచ్చుకున్నవీ! ...క్రొత్త

పచ్చని చిగురాకు బాల
బంగరు మై పూతతో!
ఆకుచాటులందున తన
యందమునే చూచుకుంది! ...క్రొత్త

ఝుం ఝుంమ్మని తుమ్మెదలు
చుట్టి నాట్య మాడగా!
మావికొమ్మ, మాధవిలత
మధురిమలను నొలికినవీ! ...క్రొత్త

చల్లనైన సన్ననైన
పిల్ల గాలి కుఱ్ఱలూ!
వన్నెల పూ రెమ్మలతో
వగలుచేసి కులికినవీ! ...క్రొత్త

అణువణువున విశ్వమంత
ఆనందం విరిసిందీ!
క్రొత్తనేదో నూహింపగ
కోర్కె మనసు నూగిందీ! ...క్రొత్త

## చివురునుండీ పూవు

చివురునుండీ పూవు చీలిపోయిందీ!
రెమ్మ కొమ్మను వీడి సొమ్మసిల్లిందీ!

చెఱు చెమట లోలకగా చేసింది పొలముపని
ఉయ్యాలలో పాప ఊసు మతి కొచ్చింది!
స్తన్యమివ్వగ మల్లి తరలింది ఒంటిగా!

చివురునుండీ పూవు చీలిపోయిందీ!
రెమ్మ కొమ్మను వీడి సొమ్మసిల్లిందీ!

మోకాలులోతున్న ముగుద పాలేఱుపుడు
నిలువెత్తు అలలతో సిండింది నిముసమున
మల్లి మదినత్తుకొని మనసు రంజిల్లింది!

చివురునుండీ పూవు చీలిపోయిందీ!
రెమ్మ కొమ్మను వీడి సొమ్మసిల్లిందీ!

తల్లి రావే యంటు తఱచింది పాలేరు
అమ్మ వచ్చాసంటు అలరింది నామల్లి
తల్లి పిల్లలు నీటి తరగలై చిందారు!

చివురునుండీ పూవు చీలిపోయిందీ!
రెమ్మ కొమ్మను వీడి సొమ్మసిల్లిందీ!

నా తనువు మనసూను నను వీడిపోయింది
పాలేటి తరగలలో పాడింది! ఆడింది!
విను వీధికేగింది! విరిసింది చుక్కలా!

# మనసుతో విను చెలియా!

మనసుతో విను చెలియా! మఱచిపోలేను!
తనువులో నుండి నిను తగ తఱుము లేను!

అరటియాకుకు మల్లె యడలుచుంటిని సఖియా!
చిఱుగాలులకు గూడ చిత్రముగు రీతిని!
మనసు కంపటియాయ్యె! మల్లి నీ యెడబాటు!

మనసుతో విను చెలియా! మఱచిపోలేను!
తనువులో నుండి నిను తగ తఱుము లేను!

నింగిచుక్కలమీాద నీవు పాడిన పాట
మగువ! నా మనసులో మల్లెపూవులు పూయు
ఎటు మఱతు నాపాట? ఎటు విఱతు నీమాట?

మనసుతో విను చెలియా! మరచిపో లేను!
తనువులో నుండి నిను తగ తఱుము లేను!

మల్లెచెట్టు క్రింద మగువ! నీ వానాడు
చిలుక కథలను నీవు చిత్రముగ చెప్పావు
మఱచిపోలేను సఖి! మన వలపు మన చెలిమి!

మనసుతో విను చెలియ మఱచిపోలేను!
తనువులో నుండి నిను తగ తఱుము లేను!

తిరిగి మన మానాటి చిత్రములు చేసేమ?
మఱుజన్మలోనైన మల్లి మన మతుకుదుమ?
గాఢమగు ప్రేమలకు గలుగు ఫలమిదియేమొ!

# చిలుకతో నే బలికి

చిలుకతో నే బలికి కులికేది యిందుకే!
చెలియ నా మల్లినీ మఱచేటి యందుకే!

పంజరపు చిలుకతో పలుమాఱు మాటాడు
మాటాడి నామల్లి మైమఱపు చెందేది!
'చిలుక' యని నే బిలువ చిఱునగవు చిందేది!

చిలుకతో నే బలికి కులికేది యిందుకే!
చెలియ నా మల్లినీ మఱచేటి యందుకే!

ఆకుపచ్చని చీర అందముగ ధరియించి
చిలుకతో నా మల్లి కిలకిలా మాటాడ!
చిలుకెవరో! మల్లెవరో! చిత్రంగ తోచేది!

చిలుకతో నే బలికి కులికేది యిందుకే
చెలియ నా మల్లినీ మఱచేటి యందుకే!

మల్లి మాటలనన్ని మది చిలక నేర్చింది
మల్లికై నేజేయు మర్మ వేదనల విను
మల్లివలె మాటాడి మనసు తాపము మాన్పు!

చిలుకతో నే బలికి కులికేది యిందుకే!
చెలియ నామల్లినీ మఱచేటి యందుకే!

# హంస నడకలు

హంస నడకలు నడుచు అలరు నామల్లి నీ
హంస యని బిలువగా 'ఆ' యనదు, 'ఊ' యనదు!

తనను హంసగ బిలువ తగున? యను భావమో!
హంస తా గాదనుచు నలస భావము యేమొ!
కుటిల భ్రుకుటిని దాల్చు కుందు నా మనసంత!

హంస నడకలు నడుచు అలరు నా మల్లి నీ
హంస యని నే బిలువ 'ఆ' యనదు! 'ఊఁ' యనదు!

'కుటిల భ్రుకుటిని' జేరి కోమలీ! నీ మోము
'గండుతుమ్మెదయున్న కంజాత'మని యందు
అంతలో నామల్లి యలరించు ముఖమంత!

హంస నడకలు నడుచు అలరు నామల్లి నీ
హంస యని బిలువగా 'ఆ' యనదు, 'ఊఁ' యనదు!

'తుమ్మెదెట బోయె'నన త్రుళ్లుతూ నామల్లి
'పూదోట కేగె'నను 'పోయిచూత' మనంను!
హంస నడకలతోడ ననుసరించును నన్ను!

హంసనడకలు నడుచు అలరు నా మల్లినీ
హంస యని బిలువగా 'ఆ' యనదు 'ఊ' యనదు!

# సిగ్గు!

సిగ్గేల మల్లియన
చిరునవ్వు లొలుకుచు
తన మొగము కరముతో
తాంజాటు చేసింది!

మాటాడ సిగ్గేల
మల్లియని నేబలుక
మాటాడ యత్నించి
మౌనమూనిందీ!

మనసు మెచ్చిన పతిని
మనసు నచ్చిన సతివి
మర్మమెందులకె నా
మల్లి! యని నే బలుక
హృదయ మిదె గొను మంచు
హృది హృదిని జేర్చింది!

## నా మల్లి సొగసులు

నా మల్లి సొగసులు నాకు నాకే తెలుసు
ఏ లోకమునలేని యెన్నెన్ని సొగసులో!

నిండుచందురు మొగము నీలి మబ్బుల కురులు
కలువ పూవులవంటి కనులతో కులికేది
కోకిలా పాటలతో కోర్కెలూరించేది!

నా మల్లి సొగసులు నాకు నాకే తెలుసు
ఏ లోకమునలేని యెన్నెన్ని సొగసులో!

పట్టుచీరనుగట్టి పసుపు పారాణితో
బుగ్గచుక్కను బెట్టి బొట్టు కాటుక దిద్ది
సిగపూల నలరింప జేర నను బిలిచేది!

నా మల్లి సొగసులు నాకు నాకే తెలుసు
ఏ లోకమున లేని యెన్నెన్ని సొగసులో!

వేరైతిమని మనసు వెతలు పొందుటలేదు
దూరమై పోతిమని దురపిల్లుటా లేదు
మల్లినొక బొమ్మగా మలచితిని మనసులో!

నా మల్లి సొగసులు నాకు నాకే తెలుసు
ఏ లోకమునలేని యెన్నెన్ని సొగసులో!

## ఈ శిశిర ఋతు భార

ఈ శిశిర ఋతుభార మెటుల సహియింతు?
నీవులేనీ బ్రదుకు నే నెటుల భరియింతు?
నీవు లేనీ బ్రతుకు నే నెటుల భరియింతు?

ఆకులన్నీ రాలి అందాలు పోనాడి
మోడువలె నిలిచినా మోదహీనపు బ్రదుకు !
ఆ వసంతపు గీతి నాలపింతున యింక?

ఈశిశిర ఋతుభార మెటుల సహియింతు?
నీవులేనీ బ్రదుకు నే నెటుల భరియింతు?

క్షీణ చంద్రునిబోలె చిన్నబోయెను మనసు
మినుకు తారకుమల్లె మేనిపస తరిగింది!
కలలవలె నా స్మృతులు కఱిగి నీరయినవి!

ఈ శిశిర ఋతుభార మెటుల సహియింతు?
నీవులేనీ బ్రదుకు నే నెటుల భరియింతు?

మల్లి! మన మిద్దఱము మళ్ళి పుట్టుదుమా?
మఱల మన మొక్కటై మనసు కలుపుదుమా?
నవ వసంతమునందు నాట్యమాడుదుమా ?

ఈ శిశిర ఋతుభార మెటుల సహియింతు?
నీవులేనీ బ్రదుకు నే. నెటుల భరియింతు?
నీవు లేనీ బ్రతుకు నే నెటుల భరియింతు?

# గువ్వ జంటను జూడ

గువ్వ జంటనుజూడ గుండెలవియును నాకు
మల్లి జ్ఞాపకమొచ్చి మనసు చెఱువగును!

గువజంట కువకువలు గుచ్చుకుని ములుకులై
మల్లి మాటల పూలమాల నా మది జీల్చు!
గుండెలాడిన నాటి గుసగుసలు మదికొచ్చు!

గువ్వ జంటనుజూడ గుండెలవియును నాకు
మల్లి జ్ఞాపకమొచ్చి మనసు చెఱువగును!

నే బలుక తా బలుక నేమేమొ యేమేమొ
చెవిజేరి చెవిజేరి చెప్పుకొను వారలము!
అర్ధరేతిరి దాటి యలు తెల్లవారేది!

గువ్వ జంటనుజూడ గుండెలవియును నాకు
మల్లి జ్ఞాపకమొచ్చి మనసు చెఱువగును!

గువజంట కువకువల గుట్టుమట్టే మనగ
ఆరిందవలె మల్లి అర్థాలు చెప్పేది!
'ప్రేమ సత్యమనీ!' 'ప్రీతి నిత్యమనీ!'

గువ్వ జంటనుజూడ గుండెలవియును నాకు
మల్లి జ్ఞాపకమొచ్చి మనసు చెఱువగును!

## కలల నన్నింటి మల్లి

కలల నన్నింటి మల్లి! కథలుగా జెప్పేవు
నా కలల మర్మములు నీకెటుల తెలియూ?

నేను నీవూ కలిసి నింగిలో పువ్వులుగ
చుక్కలలో తిరిగింది సూటిగా జెప్పేవు!
తిరిగి మన మొచ్చింది తీరుగా పలికేవు!

కలల నన్నింటి మల్లి! కథలుగా జెప్పేవు!
నా కలల మర్మములు నీకెటుల తెలియూ?

పున్నమీ రేతిరీ పూలపడవా నెక్కి
సప్త స్వరములతోడ చక్కగా గొంతెత్తి
జంటగా పాడింది సరసముగ జెప్పేవు!

కలలనన్నింటి మల్లి! కథలుగా జెప్పేవు!
నా కలల మర్మములు నీకెటుల తెలియూ?

నే మురళి వాయింప నీవు నాట్యము సేయు
వన్నె చిన్నెలనన్ని వరుసగా జెప్పేవు
పాటగా పాడేవు ప్రతిరాత్రి కలలన్ని!

కలలనన్నింటి మల్లి కథలుగా జెప్పేవు
నా కలల మర్మములు నీకెట్లు తెలియూ?

నీవు నా మనసేమొ నీవు నేనో యేమొ!
నే గనెడి కలలన్ని నీవు గాంచుదు వేమొ!
మనసులో మనసువై మతిగుట్టు లాగావు!

## కొమ్మ చాటున జేరి

కొమ్మచాటున జేరి 'కో' యనకె మల్లీ!
కొసరి కొసరీ నాదు కోర్కె లూరించీ!

తెలిమబ్బు చీరతో మలిమబ్బు రవికెతో
హంసవలె కులుకుతు నలరుదువు నాముందు
నుదుట కుంకుమ దిద్ద నూలు కొలిపెదవు!

కొమ్మచాటున జేరి 'కో' యనకె మల్లీ!
కొసరి కొసరీ నాదు కోర్కె లూరించీ!

వీటిఒడ్డున నేను ఏకాంతముగ జేర
నీవు కన్నులు కలుప నేకరము సాపగా
పరులు చూచెదరంటు పారిపోయెదవూ!

కొమ్మచాటున జేరి 'కో' య్యనకె మల్లీ!
కొసరి కొసరీ నాదు కోర్కె లూరించీ!

ఆకులను పువ్వులను నలరు మాలనుగట్టి
ఒసర చే ధరియించి వొయ్యారముగ మొలుకుదువు
గళసీను వేయమని కరము సాచేవు!

కొమ్మచాటున జేరి 'కో' యనకె మల్లీ!
కొసరి కొసరీ నాదు కోర్కె లూరించీ!

కొమ్మ చాటెందుకే 'కో' యనుట యెందుకే!
మనసులో వేసితిని మల్లెపందిరి నీకు
నీవు లేనీ నేను నిజముగా నే లేను

## అందుకేనే మల్లి!

అందుకేనే మల్లి! అన్నాను ఆమాట
చెలియ నీ మేలుకై చేసింది తప్పా?

అందాల నీ మోము చందాల పరికించి
వెన్నెలల జాబిల్లి వన్నెలను దోచుకొను
జాబిల్లి కెదురుగా సఖియ! తిరుగకుమంచు!

అందుకేనే మల్లి! అన్నాను ఆమాట
చెలియ! నీ మేలుకై చేసింది తప్పా?

కొలనిలో జూడకుము కోరి నీ కనుసొగసు
కలువ కాంతలు మూగి కాంత! దొంగిలిసేయు
అటు బోకుమని కాద! హద్దులో నుంచితిని!

అందుకేనే మల్లి! అన్నాను ఆమాట
చెలియ! నీ మేలుకై చేసింది తప్పా?

చిలుకతో బలుకకుము! చిఱుపలుకు దోచుకొను
కోకిలను కూడకుము గొంతు తీపిని మ్రింగు
నీ అంద చందాలు నిలుప గద్దించితిని!

అందుకేనే మల్లి! అన్నాను ఆమాట!
చెలియ నీ మేలుకై చేసింది తప్పా?

# పాట పాడవె మల్లి!

పాట పాడవె మల్లి! పడవనే నడుపుతా!
నీపాట తేనెలో నే తేలిపోతా!

నన్నునీ పెదవిపై జారేటి తేనెతో
మేలి బంగరు వీణ మీటినా రీతిగా
తీయగా ఓ పాట తీరుగా పాడవే!

పాట పాడవె మల్లి పడవనే నడుపుతా!
నీపాట తేనెలో నే తేలిపోతా!

జాబిల్లిలో నుండి జారేటి రేకగా
వెన్నెల్లో తడిసినా కన్నె కల్వకు మల్లె
నీ మనసులో పాట నిండైన గొంతుతో.

పాట పాడవె మల్లి పడవ నే నడుపుతా!
నీపాట తేనెలో నే తేలిపోతా!

కలకాల మీా పుడమి కలిసి యుందామనీ
ఈ పడవ పయనమున యేపాటు జరిగినా
ఆనందలోకాల నటు కలిసి కొందమనీ!

పాట పాడవె మల్లి పడవనే నడుపుతా!
నీపాట తేనెలో నే తేలిపోతా!

## మల్లి నీ చిత్రమును

మల్లి! నీ చిత్రమును మనసులో వ్రాయుదును
మౌనముగ నిలిచి నా మనసులో నతుకూ!

నీలి మబ్బులతోడ నీ కురుల సద్దుదును!
కలువ పూవులతోడ కన్నులమరింతు!
చెలియ పుష్పాదులతో చెక్కు లమరించెదను!

మల్లి! నీ చిత్రమును మనసులో వ్రాయుదును!
మౌనముగ నిలిచి నా మనసులో నతుకూ!

ఇంద్రధనుసును దెత్తు నేడు రంగులతోడ
వనములోగల పూల వన్నెలను నిదె దెత్తు
ఎన్నెన్నో కల్పనల నింపుగా నినుగూర్తు!

మల్లి! నీ చిత్రమును మనసులో వ్రాయుదును
మౌనముగ నిలిచి నా మనసులో నతుకూ!

ప్రేమ శాశ్వతమంటు ప్రీతిగా పాడావు
ఆపాట! ఆరూపు! అతికింది గుండెలో
ఆరనీ దీపముగ అమరత్వ మొందింది!

మల్లి! నీ చిత్రమును మనసులో వ్రాయుదును
మౌనముగ నిలిచి నా మనసులో నతుకూ!

# నేను లేని రాత్రి

నేను లేనీ రేయి నిద్దురేపోదు!
మల్లికున్నా ప్రేమ మమత లెటు మఱతూ?

పూలు ముడువదు కురుల బొట్టుకాటుక నిడదు
నిలువెల్ల నీరగుచు నీడలాగయ్యేది!
నా రాకకై జూచి నాతి సగమయ్యేది!

నేను లేనీ రేయి నిద్దురేపోదు!
మల్లికున్నా ప్రేమ మమత లెటు మఱతూ?

మిద్దెక్కి నలుదిశల మీను కన్నులతోడ
నిట్టూర్చి పలుమారు నీరవధ్వనులతో
చెలువ మబ్బుల జూచి చిత్రముగ పలికేది!

నేను లేనీ రేయి నిద్దురేపోదు!
మల్లికున్నా ప్రేమ మమత లెటు మఱతూ?

నను విడిచి క్షణమైన నాతి దూరముగాదు
లతవోలె నా మనసు జతగూడి కులికేది!
మనసు నలుపులు మాపి మమతలను కురిసేది!

నేను లేనీ రేయి నిద్దురేబోదు!
మల్లికున్నా ప్రేమ మమతలెటు మఱతూ?

## జంటగా నా మల్లి

జంటగా నామల్లి వెంటనుండాలీ!
పంట చేనీలోన పరుగు లెత్తాలీ!

మంచెపై నే నుండి మల్లియని పిలువగా
పచ్చనీ చీరతో పరువములు నొలుకుతూ
కులుకుతూ వస్తుంది నామల్లీ!
కుందనపు బొమ్మలా నామల్లీ!

జంటగా నామల్లి వెంట నుండాలీ!
పంట చేనీలోన పరుగు లెత్తాలీ!

ఆటపాటల తోడ అలరించు నామల్లి
పంట చేనంతటిని ప్రతిధ్వనులు గావించు!
ఒక చోట నిలువదు నామల్లీ!
ఒయ్యారి భామవలె నామల్లీ!

జంటగా నామల్లి వెంట నుండాలీ!
పంట చేనీలోన పరుగు లెత్తాలీ!

నను జేరి కవ్వించు నను పరుగు లెత్తించు
నా నీడగా మారు నా వెనుక ముందులను
మురిపించు నడిపించు నామల్లీ
ముందడుగు వేయించు నామల్లీ!

జంటగా నామల్లి వెంట నుండాలీ
పంటచేనీ లోన పరుగు లెత్తాలీ

# నిదురపోవే మల్లి

నిదుర పోవే మల్లి! నిదురపో మల్లీ
నిదురలోనే సుఖము నీవు కనుగొనుము!

కను కొలుకులందున కన్నీర దేందుకే
గడిచినా కథలన్ని కలిసి మదికొచ్చెనా?
అన్నింటిని మఱచి అలరి నిద్దుర పోవె!

నిదుర పోవే మల్లి! నిదురపో మల్లీ!
నిదురలోనే సుఖము నీవు కనుగొనుము!

బంగారు కలలతో పవళించు శయ్యపై
తెలిమబ్బు తెరలలో తేలిపో గీతముల!
గిరులపై, నదులపై క్రీడించు నాట్యముల!

నిదుర పోవే మల్లి! నిదురపో మల్లీ!
నిదురలోనే సుఖము నీవు కనుగొనుము!

నను మరచిపో చెలీ! నా కథలు మఱచిపో
చిఱునవ్వు పువ్వులతో చిర సౌఖ్యమున దేలు
చినిగినా బ్రతుకుతో చింతలను నే నుందు!

నిదుర పోవే మల్లి! నిదురపో మల్లీ!
నిదురలోనే సుఖము నీవు కనుగొనుము!

## ఇంత ప్రేమని తెలుపలేను

ఇంత ప్రేమని తెలుపలేను! మల్లిదీ
అంత ప్రేమని పలుకలేను!

తనవెంట జంటగా తనరి యుండాలంట
నిలిచినా నడిచినా నీడ నవ్వాలంట
కలల లోపల గూడ కలిసి యుండాలంట!

ఇంత ప్రేమని తెలుపలేను! మల్లి దీ
అంత ప్రేమని పలుకలేను!

వెన్నెలలో నిద్దరము విహరింప వలెనంట
పడవలో తనుగూడి పయనింప వలె నంట
ఏకాంత ద్వీపమున నిలుగట్ట వలె నంట

ఇంత ప్రేమని తెలుపలేను! మల్లి దీ
అంత ప్రేమని పలుకలేను!

'ఇంత ప్రేమెందుకే ఇంతి?' యని పలుకగా
ఎంతో కాలము నేను నీ నుండబోననుచు
కన్నీటి ధారలను కౌగిటిని యిమిడేది!

ఇంత ప్రేమని తెలుపలేను! మల్లిదీ!
అంత ప్రేమని పలుకలేను!

# రాతి గుండె

రాతి గుండే నీది మల్లీ! నల్ల
రాతి గుండే నీది మల్లి!

నన్నొంటరిగ జేసి నను విడిచిపోయావు
కన్న కలలన్నిటిని కల్లగా జేశావు!
ఆశ లేమాయనే మల్లీ! నాటి
ప్రతిన లేమాయనే మల్లీ!

రాతి గుండే నీది మల్లీ! నల్ల
రాతి గుండే నీది మల్లీ!

నీవు లేని బ్రదుకు నీడగా మారింది!
దారి తెలియని బాటసారిగా నయ్యాను!
పాట లేమాయెనే మల్లీ! నాటి
ఆట లేమాయెనే మల్లీ!

రాతి గుండే నీది మల్లీ! నల్ల
రాతి గుండే నీది మల్లీ!

రెక్క విరిగిన పక్షి రెక్కవలె కూలాను!
కటిక చీకటిలోన కఱిగిపోతున్నాను!
అలక లేమాయెనే మల్లీ-నాటి
పులక లేమాయెనే మల్లీ!

రాతి గుండే నీది మల్లీ! నల్ల
రాతి గుండే నీది మల్లీ!

# కొలని ప్రక్కన మల్లి

కొలని ప్రక్కన మల్లి కూర్చున్నదీ-మనసు
కోటియచ్చరలతో దీటన్నదీ

కొలనిలో తామరలు కలకలా నవ్వేవి
తుమ్మెదలు రాగాలు తూలుతూ పాడేవి
పుష్పాదుల రంగులతో పుడమి విప్పారేది!

కొలని ప్రక్కన మల్లి కూర్చున్నదీ-మనసు
కోటియచ్చరలతో దీటన్నదీ

చల్లగాలులు రేగి సవ్వడులు చేసేవి
కూయంటు దూరముగ కోకిలలు పాడేవి
గగనమంతా నీలికాంతులతో నిండేది

కొలని ప్రక్కన మల్లి కూర్చున్నదీ-మనసు
కోటియచ్చరలతో దీటన్నదీ

మల్లి రూపును జూచి మర్మముగ కొలనిలో
జలదేవతేమొనని చేర నే వెనుదీతు
మల్లి తానే వచ్చి మమతతో హృది నిముడు

కొలని ప్రక్కన మల్లి కూర్చున్నదీ-మనసు
కోటియచ్చరలతో దీటన్నదీ

# గుమ్మడి పండంటి కొడుకు

గుమ్మడి పండంటి కొడుకు పుట్టాలంటు
చెట్టు పుట్టకు మల్లి శిర మొంచుతాది

కుల దేవతల నెల్ల కూర్మి పూజిస్తాది!
భద్రాద్రి రాములుకు భజనలే చేస్తాది!
ముడుపులతో వెంకనకు మోకరిలుతాది!

గుమ్మడి పండంటి కొడుకు పుట్టాలంటు
చెట్టు పుట్టకు మల్లి శిర మొంచుతాది!

ముత్తయిదువుల కెల్ల బొట్టుకాటుక దిద్దు
పూలతో పండ్లతో పూజించు తలవంచు!
చిన్నారి బాలలకు చిరుతిండ్లు తినిపించు!

గుమ్మడి పండంటి కొడుకు పుట్టాలంటు
చెట్టు పుట్టకు మల్లి శిర మొంచుతాది!

గుమ్మడి పండంటి కొడుకొక్కడేలనే
పనస పండుకు మల్లె పదిమంది కనమంచు
పలుకగా నామల్లి పరవశించును తుళ్ళి!

గుమ్మడి పండంటి కొడుకు పుట్టాలంటు
చెట్టు పుట్టకు మల్లి శిర మొంచుతాది!

## ఆ మనసు ఆ తీపి

ఆ మనసు ఆ తీపి మల్లిదీ! ఇంక
అటువంటి మల్లి నిక జూడను!

నేను లేసి రోజు నిజముగా వెళ్ళొస్తు
మాటమంతీ లేక మణిగి యణిగుండేది!
కలతబాటాలుకుద్ది నా మల్లీ!
కంట సీరొలుకుద్ది నా మల్లీ!

ఆ మనసు ఆ తీపి మల్లిదీ! ఇంక
అటువంటి మల్లినిక జూడను!

ఆకురాలిన గూడ అటు పిట్ట పలికినా
నే వచ్చినానంటు నిలిచి దిక్కులు చూచు!
నా జాడకై వెదకు నా మల్లీ!
నా రాకకై కుందు నా మల్లీ!

ఆ మనసు ఆ తీపి మల్లిదీ! ఇంక
అటువంటి మల్లినిక జూడను!

ఈరోజు నారాజు నిలు తిరిగి వచ్చునా?
ఎడబాటు లెటులోర్తు సిలవేల్పులార! యని
చేరి శకునము లడుగు నా మల్లీ!
చిలుక గోరింకలను నా మల్లీ!

# మల్లిమాటలు మంచి

మల్లి మాటలు మంచి కథలవుతవీ!
మల్లి పాటలు మంచి కవితవుతదీ!

మాటలే పూదోట
బాటగా, శృంగార
మూటగా, తేనెలా
తేటగా విలసిల్లు!

మల్లి మాటలు మంచి కథలవుతవీ!
మల్లి పాటలు మంచి కవితవుతదీ!

పాటలే కోకిలా
పాటలై, సెలయేటి
పాటులై, కవిపలుకు
మాటలై మదిదోచు!

మల్లి మాటలు మంచి కథలవుతవీ!
మల్లి పాటలు మంచి కవితవుతదీ!

మాటలలో తొలిసంజ
కోటులను జూస్తాను!
గీతిలో నవకవిత
కీతి తొలకిస్తాను!
ఆనంద మాధురిని
అటు తేలిపోతాను?

మల్లి పాటలు మంచి కథలవుతవీ!
మల్లి పాటలు మంచి కవితవుతదీ!

# పువ్వు లంటే

పువ్వులంటే మల్లి కిష్టమూ! మల్లె
పువ్వుగా తానుండ యిష్టమూ!

పూలతోటకు బోవు
పూలతో జతగూడు
పువ్వులలో పువ్వుగా
పూని ముచ్చటలాడు!

పువ్వులంటే మల్లి కిష్టమూ! మల్లె
పువ్వుగా తానుండ యిష్టమూ!

పువ్వుగా తా మాఱి
పుప్పొడులు రాల్పునట!
తుమ్మెదగ నే నాడి
తూలి పాడాలంట!

పువ్వులంటే మల్లి కిష్టమూ! మల్లె
పువ్వుగా తానుండ యిష్టమూ!

పువ్వుగా తా వాడి
పుడమిపై బడునంట
మురిపెముగ నే దీసి
ముద్దాడ వలెనంట!

పువ్వులంటే మల్లి కిష్టమూ! మల్లె
పూవుగా తానుండ యిష్టమూ!

# చెప్పవే గోరింక

చెప్పవే గోరింక చేరి రివ్వు రివ్వునా
మబ్బు లవతల ఉన్న మల్లితో మాటా!
మబ్బు లవతల వున్న మల్లితో మాటా!

నిదుర నీరు లేక నీరసిలు తుంటాది
చేయి చెంపకు జేర్చి చింతతో నుంటాది
ఓదార్చి తెలుపవే ఓ పసిడి గోరింక!

చెప్పవే గోరింక! చేరి రివ్వు రివ్వునా!
మబ్బు లవతల ఉన్న మల్లితో మాటా!

దిక్కులను జూస్తాది దిశల పరికిస్తాది
నవరంగులను గూర్చి నా బొమ్మ గీస్తాది
మూర్ఛలలో నా మల్లి మునిగి తేలుంటాది!

చెప్పవే గోరింక చేరి రివ్వు రివ్వునా
మబ్బు లవతల ఉన్న మల్లితో మాటా!

కలల కనవల దనుము కన్నీరు రాల్పకను!
నిట్టూర్పు సెగలతో నీరసింపకు మనుము
గడియలో నీరాజు కదిలి రాగల డనుము!

చెప్పవే గోరింక చేరి రివ్వు రివ్వునా
మబ్బు లవతల ఉన్న మల్లితో మాటా!
మబ్బు లవతలవున్న మల్లితో మాటా!

## పాటొకటి పాడమని

పాటొకటి పాడమని బలవంత పెట్టకే।
పాడలేనే మల్లి పరవశము జెందీ।
పాడలేనే మల్లి పరవశము జెందీ!

ఎడబాటుతో మనము నిడుము పాలైనట్లు
రాత్రి కలలో పొగిలి రగిలింది నా మనసు
కలత పొందిన మనసు కలవరము పోలేదు!

పాటొకటి పాడమని బలవంత పెట్టకే
పాడలేనే మల్లి పరవశము జెందీ!

గువ జంటలో నొకటి గూటిలో లేనట్లు
పూలతలు గాలికీ నేలకొఱిగిన యట్లు
నీవు లేని నేను నీడగా కలగంటి!

పాటొకటి పాడమని బలవంత పెట్టకే
పాడలేనే మల్లి పరవశము జెందీ!

సుక్కల్లె నువ్వుపైకి యెక్కి పోయినయట్లు
ఒంటరిగ నేజిక్కి ఓడలో నున్నట్లు
కంటనీటను నేను కలగి మునిగినయట్లు!

పాటొకటి పాడమని బలవంత పెట్టకే
పాడలేనే మల్లి పరవశము జెందీ!
పాడలేనే మల్లి పరవశము జెందీ!

## ఏ మంచి రూపమును

ఏమంచి రూపమును ఈ కనుల గన్నా!
ఆ మల్లి రూపమే అగుపించు కనులా!

హంసనడకను జూచ అలరు నెమ్మిని జూచ
చిలుక కోకిల ధ్వనులు చెవులార నే విన్న
మల్లి నడకలె నాకు కనిపించూ!
మల్లి పలుకులె నాకు వినిపించూ!

ఏ మంచి రూపమును ఈ కనులగన్నా
ఆ మల్లి రూపమే అగుపించు కనులా!

సెలయేటి జాలులను చిఱుతరగలను గనిన
తొలి సంజ కెంపులో తళుకు బెళుకులు గనిన
ఆ మల్లి వళులె నా కగుపించూ!
ఆ మల్లి సొంపులే కనిపించూ!

ఏ మంచి రూపమును ఈ కనుల గనినా
ఆ మల్లి రూపమే అగుపించు కనులా!

పూలతోటను గనిన పుష్పించినటుదోచు
వెన్నెలా కిరణమై వెలిగినటు దోచు మది
కవి పాట తీపిగా వినిపించూ!
కవ్వించు కనబడక తపియించూ!

ఏ మంచి రూపమును ఈ కనుల గనినా!
ఆ మల్లి రూపమే అగుపించు కనులా!

## మల్లి రూపిట్టిదని

మల్లి రూపిట్టిదని యెటుల రూపింతూ?
మల్లి ప్రేమిట్టిదని యెటుల వినిపింతూ?

నిండుచందురుమల్లె నిసైన మొగముతో
మెఱుఫు తళుకుమల్లె మేని సొగసుండేది
హంసవలె నడిచేది నా మల్లీ!
అందాల భరిణలా నా మల్లీ!

మల్లి రూపిట్టిదని యెటుల రూపింతు?
మల్లి ప్రేమిట్టిదని యెటుల వినిపింతూ!

నీడలాగుండేది నిముసమైనను విడక
మనసులో మనసుగా మాటుమణిగుండేది
పాటలో మాటలో నా మల్లీ!
పల్లవిని పలికేది నా మల్లీ!

మల్లి రూపిట్టిదని యెటుల రూపింతు?
మల్లి ప్రేమిట్టిదని యెటుల వినిపింతూ!

మల్లి సొగసులముందు మఱియెవరు సాటి?
మల్లి ప్రేమకుసాటి మల్లినే చెప్పాలి!
మళ్ళి జన్మకు నిన్నె ఓ మల్లీ!
మళ్ళి వరియిస్తాను నా మల్లీ!

మల్లి రూపిట్టిదని యెటుల రూపింతు?
మల్లి ప్రేమిట్టిదని యెటుల వినిపింతూ!

## నింగి చుక్కలనైన

నింగిచుక్కలనైన లెక్కింపగా వచ్చు
మల్లి సొగసులు తెలుప మాటలే రావు!
మల్లి సొగసులు తెలుప మాటలే రావు!

వెన్నెలా పువ్వులా వికసించు నెమ్మొగము
నల్లకలువల మల్లె పల్లవించును కనులు
మెఱువు తీగెకు మల్లె మేనిసొగసులు మెఱయు-

నింగి చుక్కలనైన లెక్కింప వచ్చు
మల్లి సొగసులు దెలుప మాటలేరావు!

ఇన్ని అందాలు నీకెట్లొచ్చనే మల్లి?
అద్దంలో జూడవే అలరు నీ సొగసులన
'నీమనసు వెలుగులే నిలిచె నాపై' ననును!

నింగి చుక్కలనైన లెక్కింపగా వచ్చు
మల్లి సొగసులు దెలుప మాటలేరావు!

దేవబాలకు మల్లె దివికెళ్ళి పోయావు
అందాలనన్నిటిని సదిమి నాకన్నులను
జంటవిడిచీ నన్ను ఒంటరిని జేశావు!

నింగిచుక్కలనైన లెక్కింపగా వచ్చు
మల్లి సొగసులు దెలుప మాటలేరావు!
మల్లి సొగసులు తెలుప మాటలే రావు!

# కుమిలేటి నా మనసు

కుమిలేటి నా మనసు గుబగుబలు చేయకే
కూయంటు కోకిలా గున్నమామిడిపై!
కూయంటు కోకిలా గున్నమామిడిపై!

మల్లి వలె పాడేవు మనసూరు గొంతుతో
కొసరి కొసరీ పాడి కోర్కెలూరించేవు
మల్లి జ్ఞాపకమొచ్చి మది వేయి ముక్కలగు!

కుమిలేటి నా మదిని గుబగుబలు చేయకే!
కూయంటు కోకిలా! గున్నమామిడిపై!

చినిగినా బ్రతుకునకు చిగురేల? పూవేల?
వాసంత మన్మథుని వలపు బాణములేల?
మల్లి లేనీ నాకు మఱి చందమామేల?

కుమిలేటి నా మదిని గుబగుబలు చేయకే!
కూయంటు కోకిలా! గున్నమామిడిపై!

నీగొంతు పాటతో నే కలుప లేనుగదె!
కొండకోనలలోన గొంతెత్తి పాడుకో
మల్లి పాటను పాడి మది జ్వాల రేపకే!

కుమిలేటి నా మదిని గుబగుబలు చేయకే!
కూయంటు కోకిలా! గున్నమామిడిపై!
కూయంటు కోకిలా! గున్నమామిడిపై!

# స్వామి కోవెల కెళ్లి

స్వామి కోవెలకెళ్ళి సాష్టాంగ పడతాది
ముద్దుపాపను మల్లి మోకరిల జేయూ!
ముద్దుపాపను మల్లి మోకరిల జేయూ!

పువ్వులతో పండ్లతో పూజించు దేవుణ్ణి
మనసులో కోరికను మర్మముగ జెప్పేది!
పాపతో దేవుడికి పలికించు జేజేలు!

స్వామి కోవెలకెళ్ళి సాష్టాంగ పడతాది
ముద్దుపాపను మల్లి మోకరిల జేయూ!

కోటికాంతులు జిమ్ము కోవెలా గోపురము
ఆ వెనుక వెలిగేటి అందాల జాబిలిని
పాప కనులకు జూపి పట్టించు చేతులను!

స్వామి కోవెలకెళ్ళి సాష్టాంగ పడతాది
ముద్దు పాపను మల్లి మోకరిల జేయూ!

పల్లె బాగుండాలి! ప్రజలు బాగుండాలి!
పుడమి సంపదలతో పొరలిపోవాలంటు
పాపతో పలికించి పరవశించును మల్లి

స్వామి కోవెలకెళ్ళి సాష్టాంగ బడతాది!
ముద్దుపాపను మల్లి మోకరిలజేయూ!
ముద్దుపాపను మల్లి మోకరిల జేయూ!

## గడియ తాళగలేదు

గడియ తాళగలేదు కనుచూపు మఱుగైన
నేనులేనీ రాత్రి నిద్దురే బోదు!
నేను లేనిరాత్రి నిద్దురే బోదు!

కన్నీరు తొలుకుతు కాకితో కబురంపు
పంజరపు చిలుకతో పలికి శకునము లడుగు
పరుగెత్తు మబ్బులను పరికించు దినముగ!

గడియ తాళగలేదు కనుచూపు మఱుగైన
నేనులేనీ రాత్రి నిద్దురే బోదు!

మిద్దెక్కి వీక్షించు మిలమిలల కనులార్ప
ఆకురాలిన, పక్షి యలికిడులు చెవి విన్న
నారాకగా నెంచి నాతి చెంగున లేచు!

గడియ తాళగలేదు కనుచూపు మఱుగైన
నేనులేనీ రాత్రి నిద్దురేబోదు।

చందమామను జూచి జాలిగా రోదించు
మంచు రాత్రికి మల్లె మగువ కన్నీరొలుకు
వెన్నెలా రాత్రివలె వెలవెలాపోతాది!

గడియ తాళగలేదు కనుచూపు మఱుగైన
నేనులేనీ రాత్రి నిద్దురే బోదు।
నేనులేనీ రాత్రి నిద్దురే బోదు!

## మల్లెచెట్టూ క్రింద

మల్లె చెట్టూక్రింద మగువ మన ముచ్చట్లు
మళ్ళీ జన్మకునైన మఱచిపో లేనే!
మళ్ళీ జన్మకునైన మఱచిపో లేనే!

చెంప చెంపకు జేర్చి, చేర్చి హృది హృదయము
పావురపు పాటలా ప్రేమ గీతము సాగు
చెందురుణ్ణీ చూచి సిగ్గుపడిపోతాము!

మల్లెచెట్టూక్రింద మగువ మన ముచ్చట్లు
మళ్ళీ జన్మకునైన మఱచిపో లేనే!

ఒక్కొక్క మల్లెపూ వొడిలోన జార్చేవు!
మల్లెలెవరికి యన్న మదినచ్చువానికని
నిండుదోసిలిపూలు నిలిచి పై జల్లేవు!

మల్లెచెట్టూ క్రింద మగువ మన ముచ్చట్లు
మళ్ళీ జన్మకునైన మఱచిపో లేనే!

ఆనాటి వెన్నెలలు ఆనాటి మన ప్రేమ!
ఆపలుకు లాపాట లావలపు జిగిబిగులు
మఱచిపో లేనె యీ మనసు దానికి సాక్షి

మల్లె చెట్టూక్రింద మగువ మన ముచ్చట్లు
మళ్ళీ జన్మకునైన మఱచిపో లేనే!
మళ్ళీ జన్మకునైన మఱచిపో లేనే!

# కలలోన నా మల్లి

కలలోన నామల్లి కథ చెప్ప మంటాది
కథ చెప్పగా వింటు కంట నీ రొలుకూ!
కథ జెప్పగా వింటు కంట నీ రొలుకూ!

నా వెతల నన్నిటిని నా సొదల నన్నిటిని
కథవోలె పాటగా కరుణతో వినిపింతు
కనులెత్తి నను జూచి వినలేక తపియించు

కలలోన నా మల్లి కథ చెప్పమంటాది
కథ చెప్పగా వింటు కంట నీ రొలుకూ!

పక్షినై పోతినన పరికించు దిశలన్ని
చుక్కనై పోతినన జూచు నాకాశమును
శిలనైతి చెలియ! యన చింతించు తలవంచు

కలలోన నా మల్లి కథచెప్ప మంటాది
కథ చెప్పగా వింటు కంట నీ రొలుకూ!

కతవినదు వెతవినదు కన్నీట వాగులగు
తనుగూడ నావలెను తపియించుచున్నదను
ఇరువురిది ఒక కథే ఇంక చాలని యావు!

కలలోన నా మల్లి కథ చెప్ప మంటాది
కథ చెప్పగా వింటు కంట నీ రొలుకూ!
కథ జెప్పగా వింటు కంట నీ రొలుకూ!

## అప్పుడు చూడాలి

అప్పుడు చూడాలి మల్లి సొక్కులూ!
అప్పుడు చూడాలి మల్లి నిక్కులూ!

పైరుగాలికి మంచెనెక్కి
పరువమంత తొణుకునప్పుడు!

అప్పుడు చూడాలి మల్లి సొక్కులూ!
అప్పుడు చూడాలి మల్లి నిక్కులూ!

చెంగుమంటు గంతులతో
చేనిలోని మంచెపైని
రివ్వుమంటు పిట్టలపై రువ్వు రాళ్ళ దాని సొగసు!

అప్పుడు చూడాలి మల్లి సొక్కులూ!
అప్పుడు చూడాలి మల్లి నిక్కులూ!

కలువ పూలు చెవుల తురిమి
కడవనంత జేత బట్టి
మంచినీళ్ళ బావికాడ మగువ నిలిచినప్పుడూ!

అప్పుడు చూడాలి మల్లి సొక్కులూ!
అప్పుడు చూడాలి మల్లి నిక్కులూ!

వంగి వంగి గడ్డికోస్తు
వాలు చూపు కనుల తోడ
నన్ను జూచి జింకవోలె నాతి పరుగు లెత్తునపుడు!

అప్పుడు చూడాలి మల్లి సొక్కులూ!
అప్పుడు చూడాలి మల్లి నిక్కులూ!

అప్పుడు చూడాలి మల్లి సొక్కులూ!
అప్పుడు చూడాలి మల్లి నిక్కులూ!

పంట చేనిలోన నిలిచి
పరవశమై నింగి చూచి
పరుగులెత్తు మబ్బులపై పాటపాడు సఖియ సొగసు!

అప్పుడు చూడాలి మల్లి సొక్కులూ!
అప్పుడు చూడాలి మల్లి నిక్కులూ!

నీలిరంగు చీరగట్టి
నీటైన రవిక దోడిగి
మల్లె పూలు సిగనుజుట్టి మాడలాడునప్పుడు!

అప్పుడు చూడాలి మల్లి సొక్కులూ!
అప్పుడు చూడాలి మల్లి నిక్కులూ!

ఇప్పటివలె నీవు నేను
ఎప్పటికుండా లనగా
చేతిలోన చేయివేసి సిగ్గుచెందు మల్లి సొగసు!

అప్పుడు చూడాలి మల్లి సొక్కులూ!
అప్పుడు చూడాలి మల్లి నిక్కులూ!

పైరుగాలికి మంచె నెక్కె!
పరువమంత తొణుకు నపుడు!

అప్పుడు చూడాలి మల్లి సొక్కులూ!
అప్పుడు చూడాలి మల్లి నిక్కులూ!

# ఆనాటి ముచ్చటులు

ఆనాటి ముచ్చటులు ఎటుతలపనూ?
ఆనాటి సంగతులు ఎటు నిలపనూ?

ఏరువాకానాడు ఎదురుగా హారతితో
మాలచ్చిమిగ వచ్చి మధురిమలు చిందేది
కుదురుగా నా నుదుట నామల్లి!
కుంకుమలు దిద్దేది నా మల్లి!

ఆనాటి ముచ్చటులు ఎటుతలపనూ?
ఆనాటి సంగతులు ఎటు నిలపనూ?

మోటతోలుతు నేను పాట పాడుతువుంటె
పాలపిట్టలు చూచి పరవశము చెందేవి
నాట్యాలు చేసేది నా మల్లి!
నవరసము లొలికేది నా మల్లి!

ఆనాటి ముచ్చటులు ఎటు తలపనూ?
ఆనాటి సంగతులు ఎటు నిలపనూ?

'హాలిహాలీ' యని పలికి పూరించి గంపలను
పంటలచ్చిమివోలె పరవశము చెందేది
ఇలవేల్పు [illegible]
తలవంచి మొక్కేది నా మల్లి!

ఆనాటి ముచ్చటలు ఎటుతలపనూ?
ఆనాటి సంగతులు ఎటునిలపనూ?

# ఉండుండి నా మనసు

ఉండుండి నామనసు ఉలికిపడతాది!
మల్లి వెంటున్నదని మైమఱచుతాను!
ఉండుండి నా మనసు ఉలికిపడతాది!

మల్లెతీగెను జూచి మల్లిగా నే తలచి
మనసు విప్పి తీపి మాటాడతాను!
మల్లికాదని తెలిసి మనసు కుప్పగకూలు!

ఉండుండి నామనసు ఉలికిపడతాది!
మల్లి వెంటున్నదని మైమఱచుతాను!

నను జూచుచున్నట్లు నా ప్రక్క నున్నట్లు
నా వెనుక నడచుచు నాట్యమాడినయట్లు
ఆనాటి కథలన్ని యగుపించు కన్నులకు!

ఉండుండి నామనసు ఉలికిపడతాది!
మల్లి వెంటున్నదని మైమఱచుతాను!

నా మనసు భ్రమలతో నన్ను నే మఱచాను
అంతటా లో బయట అగుపించు నామల్లి!
బ్రతుకు మాయని యన్న పలుకు నిజమాయెగద!

ఉండుండి నా మనసు ఉలికిపడతాది!
మల్లి వెంటున్నదని మైమఱచుతాను!
ఉండుండి నా మనసు ఉలికిపడతాది!

# శోక జలధిని

శోకజలధిని మల్లి! శోకింపనీవే!
మనసు మంటల పొరలి మసిలిపోనీవే?
మనసు మంటల పొరలి మసిలిపోనీవే!

నాకంటి నీటిలో నా నావ మునుగనీ
నా అలల సుడులలో న న్నణగిపోవనీ!
పూలదెప్పను జేర్చి పూని దరిజేర్పకే!

శోక జలధిని మల్లి శోకింపనీవే!
మనసు మంటల పొరలి మసిలి పోనీవే!

నీ విరహా జ్వాలలను నే పొరలి తపియించి
మసిలిమండేవేళ మర్మముగ నీచేతి
చల్లనీ చందనపు తాకుడుల నీబోకె!

శోకజలధిని మల్లి! శోకింపనీవే!
మనసు మంటల పొరలి మసిలి పోనీవే!

పాలేటిరొడ్డునా పడియుంటి నే శిలగ
చిఱునగవు లేలనే! చిత్రగీతము లేల?
నా బొమ్మ గొనిపోవె! నీబొమ్మ గలచోటు!

శోకజలధిని మల్లి శోకింపనీవే!
మనసు మంటల పొరలి మసిలిపోనీవే!
మనసు మంటల పొరలి మసిలిపోనీవే!

## కనుచాటు మల్లయిన

కనుచాటు మల్లయిన కలగిపోతిని నాడు
తెరచాటు మల్లయిన తేలిపోతినిగా!

మల్లికీ నా మనసు మర్మమంతా తెలుసు
తను లేని నే క్షణము తాళలేనని తెలుసు!
కంటిలో పాపగా కలసియుండే దెపుడు!
మనసులో మనసుగా మణిగియుండేదీ!
తలపులో తలపుగా తాను మెలిగేదీ!

కనుచాటు మల్లయిన కలగిపోతిని నాడు
తెరచాటు మల్లయిన తేలిపోతినిగా!

ఒకనాడు నా మల్లి ఒయ్యారముగ నిలిచి
పాలేటి యొడ్డునా పక్షులను గనుగొనుచు
క్షణము నను యేమఱచి సఖియ రివ్వున వచ్చి
కలగినా నా హృదిని కౌగలించిందీ!
మన్నించమని తీపి మాటలాడిందీ!

కనుచాటు మల్లయిన కలగిపోతిని నాడు
తెరచాటు మల్లయిన తేలిపోతినిగా!

మిద్దెక్కి ఒకనాడు మింట చంద్రునిజూచి
ఒక్క క్షణము నను మఱచి ఒంటిగా నుందీ!
పరితాపమును దెలిసి పరుగు పరుగున వచ్చి
నిండు ప్రేమలు తొణుక నివ్వాళులిచ్చి
అంజలిని పట్టుచు అతివ నిలిచిందీ!

## మల్లి నేను కలిసి

మల్లి నేను కలసి పల్లకెక్కాము!
ఊరంత మెచ్చగా ఊరేగి వచ్చాము!

పెళ్ళికూతురు తగును పెళ్ళి కొడుకునకనీ!
పెళ్ళికొడుకూ తగును పిల్ల మల్లికనీ!
పల్లెలో జనమంత పరవశించారు!
పూలజల్లుల మేము పులకరించాము!

మల్లి నేను కలిసి పల్లకెక్కాము!
ఊరంత మెచ్చగా ఊరేగి వచ్చాము!

బాజాలు మ్రోగగా పదిమంది జేరగా
సిగ్గుతెరలను దూరి శిరవొంచు మల్లీ!
సిగ్గెందుకని నిగ్గదీసాను మల్లిసీ
చిలిపి చూపులజూచి చిఱునవ్వు నవ్వాను!

మల్లి నేను కలిసి పల్లకెక్కాను!
ఊరంత మెచ్చగా ఊరేగి వచ్చాము

మల్లి కెదురుగ నేను మల్లి నా కెదురుగా
పల్లకిలో మముజూచి పదిమంది పెద్దలు
మురిపెములు చిందగా మురిసిపోయారు
దేవతలవలె మాకు దీవె నిచ్చారు!

మల్లి నేను కలిసి పల్లకెక్కాము!
ఊరంత మెచ్చగా ఊరేగి వచ్చాము!

## మల్లినీ మఱచి

మల్లినీ మఱచి నే మఱిగుండ లేను!
మధుర స్మృతులను నేను మఱచిపోలేను!

ఒక్కొక్క ముత్తెమును ఒకదండ గూర్చినటు
చిదిమినా దీపమూ చిఱువెలుగు చిందినటు
మల్లి జ్ఞాపకమొచ్చి మది పూలతోట యగు

మల్లినీ మఱచి నే మఱిగుండ లేను!
మధుర స్మృతులను నేను మరచిపోలేను!

శ్రీకంఠములనెత్తు చెలువలతో తాగూడి
నారుమళ్ళను జేరి నాతి కలుపును దీయు
ఒయ్యారమెటుమఱతు? సయ్యాటలెటు తుడుతు?

మల్లినీ మఱచి నే మఱిగుండ లేను!
మధుర స్మృతులను నేను మఱచిపోలేను!

పండినా చేనితో బంగారు తళుకులా
ఉయ్యాల లూగుతూ సయ్యాటలాడుతూ
పరువులెత్తే మల్లి పరువముల నెటు మఱతు?

మల్లినీ మఱచి నే మఱిగుండ లేను!
మధుర స్మృతులను నేను మఱచిపోలేను!

వెన్నెలలో నామల్లి వినిపించినా కథలు
పాలేటియొడ్డునా పాడినా పాటలు
అన్ని జ్ఞాపకమొచ్చి అగ్గి రగులును మనసు!

## ఆ ఆటలే!

ఆ ఆటలే ఆడి అలరింపవే మల్లి!
ఆ పాటలే పాడి హాసియింపవే!

నీలి గగనములోని
నీలి మబ్బుల జూచి
నెమిలి వలె నృత్యమును
నేర్పుగా జేసినా!

ఆ ఆటలే ఆడి అలరింపవే మల్లి!
ఆ పాటలే పాడి హాసియింపవే!

తెలిమబ్బు చీరతో
చెలియ! కొలనూ చెంత
హంసవలె నడిచినా
ఆ వంపు సొంపులను!

ఆ ఆటలే ఆడి అలరింపవే! మల్లి
ఆ పాటలే పాడి హాసియింపవే!

గున్న మామిడి చెట్టు
కొమ్మచాటున జేరి
కోకిలావలె నాడు
'కూ'యనుచు పాడినా

ఆ ఆటలే ఆడి అలరింపవే మల్లి!
ఆ పాటలే పాడి హాసియింపవే!

## పగిలినా మూకుడు

పగిలినా మూకుడు బ్రతుకాయె నే-మల్లి!
పదిమందిలో నేను పలవైతినే!
పదిమందిలో నేను పలవైతినే!

మాటు మణిగిన రాత్రి మల్లి నే నొంటరిగ
మంచెపైకెక్కి ఓ మల్లి యని పిలువగా
చప్పట్లు చఱచి యొక నక్కిమాడిరి జనులు!

పగిలినా మూకుడు బ్రతుకాయె నే మల్లి
పదిమందిలో నేను పలవైతినే?

పాలేటి తరగలలో పడతి నిను జూచుచు
ఇసుక పొరలను వ్రాయ నింపుగా మన కథలు
'మతి చెడిన మనిషి'యని మర్మముగ బలుకుదురు!

పగిలినా మూకుడు బ్రతుకాయె నే-మల్లి!
పదిమందిలో నేను పలవైతినే!

గాఢమగు మన ప్రేమ కథల నే మెఱుగుదురు?
మన వలపు లోతులను మర్మ మే మెఱుగుదురు?
జన్మజన్మలనాటి చరిత మే మెరుగుదురు?

పగిలినా మూకుడు బ్రదుకాయె నే!-మల్లి
పదిమందిలో నేను పలవైతినే!
పదిమందిలో నేను పలవైతినే!

# గృహలక్ష్మి యని

గృహలక్ష్మి యని జనులు కూడిపొగడంగా!
వనలక్ష్మి యని నేను వలపు చిందంగా!
వనలక్ష్మి యని నేను వలపు చిందంగా!

అత్తమామలకు తా నను గు కూతుకుమల్లె
అన్ని పనులలో సాయ మందించు వినయమున
ఇంట బయటా మల్లి కంటిపాపగ నుండు!

గృహలక్ష్మి యని జనులు కూడి పొగడంగా
వనలక్ష్మి యని నేను వలపు చిందంగా!

మనసులో మనసుగా మాటలో మాటగా
నా నీడగా నుండు నామల్లి యెల్లపుడు
వెన్నెలై నామదిని వికసింప జేస్తాది!

గృహలక్ష్మి యని జనులు కూడి పొగడంగా!
వనలక్ష్మి యని నేను వలపు చిందంగా!

ఇటువంటి యిల్లాలు ఇలలోన లేదనుచు
'మావూరి మహాలక్ష్మి' 'మల్లి'యని ప్రజ పొగడ
కంటిలో ముత్యాలు కదిలేవి మల్లిలో!

గృహలక్ష్మి యని జనులు కూడిపొగడంగా
వనలక్ష్మి యని నేను వలపు చిందంగా!
వనలక్ష్మి యని నేను వలపు చిందంగా!

# క్రొత్త కోడలు వచ్చె

క్రొత్తకోడలు వచ్చె కోరి మన వీథికని
ముత్తయిదువలు వచ్చి ముసురుకున్నారు!
ముత్తయిదువలు వచ్చి ముసురుకున్నారు!

మల్లి అందముచూచి మల్లి చందముచూచి
అందాల భరిణయని యాడిపోశారూ!
పుణ్యాలరాశియని పులకరించారు!

క్రొత్త కోడలువచ్చె కోరి మన వీధి కని
ముత్తయిదువలువచ్చి ముసురుకున్నారు!

ముఖమెత్తి చూచింది మురిపెముగ ఒక భామ!
'కనులు కలువలె' అంది కఱగి ఒక లేమా!
'చిగురాకు పెదవు'లని చిందింది ఒక వనిత!

క్రొత్తకోడలువచ్చె కోరి మన వీధి కని
ముత్తయిదువలు వచ్చి ముసురుకున్నారు!

క్రొత్త కోడలు మల్లి క్రొంగ్రొత్త సిగ్గులతో
తలవంచి అందఱికి తగురీతి మ్రొక్కింది!
పదిమందిలో నన్ను 'బావ'యని పిలిచింది!

క్రొత్తకోడలువచ్చె కోరి మన వీధి కని
ముత్తయిదువలు వచ్చి ముసురుకున్నారు!
ముత్తయిదువలు వచ్చి ముసురుకున్నారు!

# పాలేటిలో జలక మాడింది

పాలేటిలో జలకమాడింది మల్లీ!
పాలేటిపై పాట పాడింది మల్లీ!
పాలేటిపై పాట పాడింది మల్లీ!

కృష్ణ వేణిని కలిసె స్పష్టముగ ముచుకుంద
ముచుకుందలో కలిసె ముద్దుగా పాలేరు!
ఆ కథల నన్నిటిని యల్లింది పాటగా!

పాలేటిలో జలకమాడింది మల్లీ!
పాలేటిపై పాటపాడింది మల్లీ!

నిలువెత్తు కెరటాలు కలిచింది మల్లీ!
పరువెత్తు ధారలలో పరువులెత్తేను మల్లి
శిరమొంచి అంజలులు చేసింది మల్లీ!

పాలేటిలో జలకమాడింది మల్లీ!
పాలేటిపై పాట పాడింది మల్లీ!

తీయని పదములతో తీరైన కంఠమున
కిన్నెరను మీటుతూ కీర్తనలు పాడింది!
పాలేటి దేవతను పరవశము చేసింది!

పాలేటిలో జలక మాడింది మల్లీ!
పాలేటిపై పాట పాడింది మల్లీ!
పాలేటిపై పాట పాడింది మల్లీ

## కంటితో జూచినా

కంటితో జూచినా కాఅు మబ్బయినా
చిత్రముగ నామల్లి చిత్రమై దోచు!

పూదోటలో నున్న
పూలతను గనుగొన్న
మల్లి నిలిచినయట్లు మనసునకు దోచును!

కంటితోజూచినా కాఅు మబ్బయినా
చిత్రముగ నామల్లి చిత్రమైదోచు!

నీలి గగనమునందు
నిండు జాబిలి జూడ
మల్లిముఖ మున్నట్లు మతి భ్రమలు పొందును!

కంటితో జూచినా కాఅుమబ్బయినా
చిత్రముగ నామల్లి చిత్రమై దోచు!

సన్ననీ సెలయేటి
జాలులలో నామల్లి
ఛాయగా నున్నదని జల్లుమను నా మనసు!

కంటితో జూచినా కాఅుమబ్బయినా
చిత్రముగ నామల్లి చిత్రమై దోచు!

మనసులో నున్న నా
మల్లి పై పై లేచి
నిండు కన్నుల జేరి నిలిచింది కాబోలు!

# గోటితో నేమైన

గోటితో నేమైన కోరి వ్రాసిననూ
ఆమల్లి రూపమే అచ్చులా గమరూ!

పండుటాకును చేతబట్టి గోటను గీయ
చిగురుటాకును బట్టి చిదిమినా గోటితో
నా మల్లిరూపమే నాకనుల నుట్టిపడు!

గోటితో నేమైన కోరి వ్రాసిననూ
ఆమల్లి రూపమే అచ్చులా గమరూ!

మల్లి యెడబాటుతో మనసు వేదన జెంది
ఇసుకతిన్నెల గోట ఇటు నటూ గీయగా
మల్లిరూపమె చిత్రమై దోచు నిసుకలో!

గోటితో నేమైన కోరి వ్రాసిననూ
ఆమల్లి రూపమే అచ్చులా గమరు!

కొలనిలో తామరను గోటితో నే ద్రెంప
నామల్లి శ్రీముఖము న ర్తించు కమలమున
కలువలను ద్రెంపగా కాంత కన్నుల జూతు!

గోటితో నేమైన కోరి వ్రాసినను
ఆమల్లి రూపమే అచ్చులా గమరు!

మనసులో నున్న నామల్లి చిగురులు వేసి
తనువునంతా గూడి తీగలు పారింది!
కొనగోటిలోగూడ కూడింది నామల్లి!

## ఏడ్చినా కన్నులా

ఏడ్చినా కన్నులూ ఎటుపొంగెనో చూడు
నీ జ్ఞాపకములు నను నిలువునా నుసిజేసె!
నీ జ్ఞాపకములు నను నిలువునా నుసిజేసె!

కొండకోనల దిరిగి కోయంటు రోదలతో
చిలుక గోరింకలను చెలియ! నిన్నడుగుదును!
నా సఖిని కంటిరా? నయముగా దెలుపుడని!

ఏడ్చినా కన్నులూ ఎటుపొంగెనో చూడు
నీ జ్ఞాపకములు నను నిలువునా నుసిజేసె!

పూలతల పొదలందు పొంచియుంటి వటంచు
చెట్టు పుట్టను జేరి చెలియ నిన్నడుగుదును!
రోదజేయు తుమ్మెదల రోదింతు నిన్నడిగి!

ఏడ్చినా కన్నులూ ఎటుపొంగెనో చూడు
నీ జ్ఞాపకములు నను నిలువునా నుసిజేసె!

ఒంటరిగ ననుజేసి జంట విడిపోయావు
నీవు లేని నేను నిలువగలనా మల్లి!
నీవెంట రానీవె! నీవున్న చోటులకు!

ఏడ్చినా కన్నులూ ఎటుపొంగెనో చూడు!
నీ జ్ఞాపకములు నను నిలువునా నుసిజేసె!
నీ జ్ఞాపకములు నను నిలువునా నుసిజేసె!

# పెళ్ళినాటి మల్లి

పెళ్ళినాటి మల్లి సొగసు చూడాలి!
పెళ్ళినాటి మల్లి సిగ్గు చూడాలి!

కంకణము, బాసికము గలగలా గాజులతో
పసుపు బట్టలతోడ పారాణితో గూడి
బుగ్గచుక్క తోడ పొలుపుగా కూర్చుంది!

పెళ్ళినాటి మల్లి సొగసు చూడాలి!
పెళ్ళినాటి మల్లి సిగ్గు చూడాలి!

తలవంచుకొని మల్లి తబ్బిబ్బు చెందేది
తలయెత్తి ననుజూడ తత్తరలు బొందేది!
నునుసిగ్గు తెరలతో కనుకొనల జూచేది!

పెళ్ళినాటి మల్లి సొగసు చూడాలి!
పెళ్ళినాటి మల్లి సిగ్గు చూడాలి!

నేతాళి గట్టగా నిగనిగలు చిందింది!
తలంబ్రాలు పోసేటి సమయమున తలయెత్తి
తనివార ననుజూచి తలంబ్రాలు పోసింది!

పెళ్ళినాటి మల్లి సొగసు చూడాలి!
పెళ్ళినాటి మల్లి సిగ్గు చూడాలి!

మూడు ముడులేయగా మురిపెముగ ననుజూచి
అరుంధతీ చుక్క నటు కొలిచి తలయెత్తి
మాంగల్యవతి నంచు మధురముగ నవ్వింది!

# మల్లి! అదిరిపడత వెందుకే?

మల్లి! అదిరి పడత వెందుకే?
మల్లి! ఉలికి పడత వెందుకే?

చందమామ ముఖముదాన
చారడేసి కళ్ళదాన
అందాల భరిణదాన వదిరి పడత వెందుకే!

మల్లి! అదిరి పడత వెందుకే?
మల్లి! ఉలికి పడత వెందుకే?

కందిరీగ నడుముదాన
కాటుకంటి కురులదాన
దొండపండు పెదవిదాన త్రుళ్ళి పడత వెందుకే?

మల్లి! అదిరి పడత వెందుకే?
మల్లి! ఉలికి పడత వెందుకే!

హంసలాంటి నడకదాన!
అలరుచిలుక పలుకుదాన!
మెఱుపులాంటి మేనుదాన! మేలమాడరావటే?

మల్లి! అదిరి పడత వెందుకే!
మల్లి! ఉలికి పడత వెందుకే!

తలంబ్రాలను బోసి నీకు
తాళిగడితి తగవెందుకు?
సిగ్గు పడత వెందుకే? మల్లి! చిన్నబోత వెందుకే?

# నిను చిత్రముగ

నిను చిత్రముగ వ్రాయ నేరనే చెలియా!
నిను శిల్పముగ జేయ జాలనే సఖియా!
నిను శిల్పముగ జేయ జాలనే సఖియా!

తొలిసంజలో లేవు మలిసంజలో లేవు
హరివిల్లులో లేవు అందాల సొగసులు!
నా మనసులో నున్న నాచెలీ! నీ సొగసు!

నిను చిత్రముగ వ్రాయ నేరనే చెలియా!
నిను శిల్పముగ జేయజాలనే సఖియా!

పూలవాసన చిందు పువ్వులా మెత్తనిది
మెఱుపు తీగెకు మల్లె మేను బంగరు ఛాయ
రాతిలో నిన్నెటుల రమ్యముగ చిత్రింతు?

నిను చిత్రముగ వ్రాయనేరనే చెలియా!
నిను శిల్పముగ జేయజాలనే సఖియా!

చిత్రముగ శిల్పముగ స్థిరముగా మనసులో
నిలిచినా రూపెటుల నిలుపుదును శిలలలో
గుడిలోని దీపమును గూటిలో నెటులుంతు?

నిను చిత్రముగ వ్రాయనేరనే చెలియా!
నిను శిల్పముగ జేయ జాలనే చెలియా!
నిను శిల్పముగ జేయ జాలనే సఖియా!

# తనువంత అల్లినా

తనువంత అల్లినా తమితీర నెటు ద్రుంతు?
మనసంత పాటినా మమత నెట్లు దెంతూ?
మనసంత పాటినా మమత నెట్లు దెంతూ?

మల్లి తన తాకుడుల అల్లినా తనువంత
సుల్లెపూవులు పూచి మధువులే విరిసింది!
తనువులో తనువైన తరుణి నెటు మఱచెదను?

తనువంత అల్లినా తమితీర నెటు ద్రుంతు?
మనసంత పాటినా మమత నెట్లు దెంతూ?

మల్లి నా మనసంత మాధురీ మహిమతో
బంగారు చిగురులను పొంగారి పారింది!
మనసులో మనసైన మమత నెటు తొలగింతు?

తనువంత అల్లినా తమితీర నెట్లు ద్రుంతు?
మనసంత పాటినా మమత నెట్లు దెంతూ?

వేఱు చేయగలేరు విధియైన నిజముగా
నా తనువు మనసులో నా మల్లి చేరింది!
నా జీవమున కలిసి నటియించు ప్రతిక్షణము!

తనువంత అల్లినా తమితీర నెటు ద్రుంతు?
మనసంత పాటినా మమత నెట్లు దెంతూ?
మనసంత పాటినా మమత నెట్లు దెంతూ?

## నూనె లేని దీప

నూనె లేని దీపమెటు వెలుగునే మల్లి?
నీవు లేని నేను ఎటు బ్రతుక గలను?
నీవు లేని నేను ఎటు బ్రతుక గలను?

పగిలినా ప్రమిదవలె పడతి నే నైతిని
దీప్తి లేని కునుకు దివ్వెలా నుంటిని!
వెలుగు కిరణములతో వికసింపగల నెటుల?

నూనె లేని దీపమెటు వెలుగునే మల్లి?
నీవు లేని నేను ఎటు బ్రతుక గలను?

మూగబోయిన గొంతు మ్రోఁగునే చెలియా?
పగిలినా మురళితో పాటనెటు పాడుదును?
గుండె మంటలనుండి గ్రుత్తు నెటు పూదండ?

నూనె లేని దీపమెటు వెలుగునే మల్లి?
నీవు లేని నేను ఎటు బ్రతుక గలను?

కటిక చీకటి నిండె కాఱడవి జగమాయె!
నీతోనె నా బ్రతుకు నీరసించిన దోల!
విషమాయె మన ప్రేమ! విధి వ్రాత నేమందు?

నూనె లేని దీపమెటు వెలుగునే మల్లి?
నీవు లేని నేను ఎటు బ్రతుక గలను?
నీవు లేని నేను ఎటు బ్రతుక గలను?

## పాడింది ఒక పాట

పాడింది ఒక పాట పడతి నా మల్లి!
క్రొత్త చిగురులు తిన్న కోకిలకు వోలె?
క్రొత్త చిగురులు తిన్న కోకిలకు వోలె?

పాలేటి సెలయేరు సోలేటి తిన్నెపై
నా కంటి పాపలో నాతి తను జూచుకుని
తీయనీ గొంతుతో తీరుగా పాడింది!

పాడింది ఒక పాట పడతి నా మల్లి!
క్రొత్త చిగురులు తిన్న కోకిలకు వోలె!

దూరాన మలి సంజ తూలేటి యరుణిమలు
నా చెలియ మొగముపై నవకాంతులను దొలుక
మోము మోమున జేర్చి ముద్దుగా పాడింది!

పాడింది ఒక పాట పడతి నా మల్లి!
క్రొత్త చిగురులు తిన్న కోకిలకు వోలె!

చేప పిల్లలు ఎగిరి చిలిపి గంతులు వేయ
పరుగెత్తు జాలు లటు పకపకా నవ్వంగ?
నా యెదను యెద జేర్చి నవగీతి పాడింది!

పాడింది ఒక పాట పడతి నా మల్లి!
క్రొత్తచిగురులు తిన్న కోకిలకు వోలె!
క్రొత్త చిగురులు తిన్న కోకిలకు వోలె!

# ప్రక్కలో పసిపాప!

ప్రక్కలో పసిపాప పాలిచ్చి ముద్దాడు
బాలెంత శోభలను పరగ నెటు మఱతు?

నోచినా నోములకు నోము పంటగు నేమొ?
చేసినా పూజలకు చిన్నారి మొలకేమొ?
మ్రొక్కినా మ్రొక్కులకు చిక్కినా ఫల మేమొ?

ప్రక్కలో పసిపాప పాలిచ్చి ముద్దాడు
బాలెంత శోభలను పరగ నెటు మఱతు?

హృదయమున కద్దుకుని మదిపొంగ ముద్దాడి
స్తన్యపానమునిచ్చు సఖియ కన్నులలోన
కోటి వెలుగుల కాంతి కుదురుగా చిందింది!

ప్రక్కలో పసిపాప పాలిచ్చి ముద్దాడు
బాలెంత శోభలను పరగ నెటు మఱతు?

ఆడినా ఆటలు పాడినా పాటలు
చేసినా చిత్రములు చెదిరి ఎటు దాగెనో!
తల్లియై నంతనే మల్లి పెరిగిన దెంతో!

ప్రక్కలో పసిపాప పాలిచ్చి ముద్దాడు
బాలెంత శోభలను పరగ నెటు మఱతు?

మల్లి చేరువజేరి తల్లిపిల్లలఁ జూచి
మల్లి తల్లయినదని మదిపొంగ నే బలుక
అరమోడ్పు కనులతో నానంద మొలికింది!

## అలనాటి తొలినాటి

అలనాటి తొలినాటి అందాల నా మల్లి
అలరినా సిగ్గులను కొలవగా తరమా ?

పూలపానుపునందు
పోసగ నా దరి రాక
చిందినా సిగ్గులు చిత్రమయ్యేపీ!

అలనాటి తొలినాటి అందాల నామల్లి
అలరినా సిగ్గులను కొలవగా తరమా?

చెలియ ముఖ కమలమును
చేర్ప నా కరములను
హిమబిందువుల శోభ నింపుగా విరిసింది!

అలనాటి తొలినాటి అందాల నా మల్లి
అలరినా సిగ్గులను కొలవగా తరమా?

పలుకదూ కులుకదూ
చిలికి నే హృది జేర్ప
చిలుక పంజరమందు చేష్టలను గనుగొందు!

అలనాటి తొలినాటి అందాల నా మల్లి
అలరినా సిగ్గులను కొలవగా తరమా?

తలుపు వైపుకు జూచు తాఁ బోవ నుంకించు
చిఱు చెమటలను జిందు, చిత్రముగ భాషించు
నను క్రొత్తగా జూచు నాతి తత్తరపడును!

## చేనిలో నా మల్లి

చేనిలో నామల్లి చేసేటి చిత్రాలు
మళ్ళి జన్మకునైన మఱచిపోలేను!

మంచెపైనుండి దిగి 'మల్లి!' యని చేసంత
అఱచి వేసారగా అలరి వెనుకగ వచ్చి
రెండుచేతుల కనులు నిండుగా మూసేది!

చేనిలో నా మల్లి చేసేటి చిత్రాలు
మళ్ళి జన్మకునైన మఱచిపోలేను!

చద్దిమూటను విప్పి నఖియ నాముందుంచి
ఒక్కొక్క ముద్దను ఒసర నోటను బెట్టు
చిలిపిగా నే జూడ చిత్రముగ నవ్వేది!

చేనిలో నామల్లి చేసేటి చిత్రాలు
మళ్ళి జన్మకునైన మఱచిపోలేను!

బురద పొలమునందు పొలువార నే నుండ
కలువ పూవులుదాల్చి కలకలా నవ్వుతు
మంచి నీ రందించు మగువ నా పెదవులకు!

చేనిలో నా మల్లి చేసేటి చిత్రాలు
మళ్ళి జన్మకునైన మఱచిపోలేను!

ములిసంజ వెలుగులో మల్లి నేనూ కలిసి
కులుకు కేరింతలతో కూడి వస్తూవుంటె
వీధంత జూచేది విప్పారు కనులతో!

# మబ్బు వీడిన చందమామే!

మబ్బు వీడిన చందమామే! నీ మొగము
మల్లెపూవుకు సమము మేనే!

చేనిలో తోటలో చెట్టు పుట్టను జేరి
దాగుడు మూతలతో తగ నన్ను మురిపించి
మురిపెముగ నా హృదిని ముద్దు బెట్టేవా!

మబ్బు వీడిన చందమామే! నీ మోము
మల్లెపూవుకు సమము మేనే!

పండు వెన్నెలలోన పాలేటి తరగలో
శిలలచాటున జేరి చిత్రముగ నిలిచేవు!
నిను వెదకి నిను జేర నను కౌగలించేవు!

మబ్బు వీడిన చందమామే! నీ మోము
మల్లెపూవుకు సముముమేనే!

కొలనిలో తామరల గూడి నీ వుండగను
తామరా పువ్వుగా తలతు నీ నెమ్మొగము!
నీటిలోనికి లాగి నిమిడెదవు కౌగిలిని!

మబ్బు వీడిన చందమామే! నీ మొగము
మల్లెపూవుకు సమము మేనే!

పూలచాటున జేరి పూవుగా మారావు
మబ్బు చాటున జేరి మగువ! జాబిలి వైతి!
నీ జ్ఞాపకములతో నిలిచితిని శిలువగా!

# బ్రతుకమ్మ పండుగకు

బ్రతుకమ్మ పండుగకు భక్తి తో లుకాడ!
బ్రతుకమ్మ నాడేది పడతి నామల్లీ!

గుమ్మడి పూవులను గూర్చి సిబ్బిని పఱచి
తంగేడు గన్నేరుల తగ జేర్చి యొక్కొకటి
పసుపు కుంకుమలతో బ్రతుకమను నిలిపేది!

బ్రతుకమ్మ పండుగకు భక్తి తోలుకాడ!
బ్రతుకమ్మ నాడేది పడతి నామల్లీ!

పట్టు బట్టలు కట్టి బంగారు నగలతో
పసుపు కుంకుమలతో పారాణి తిలకములు
బ్రతుకమను చేదాల్చి పాడుతూ వెళ్ళేది!

బ్రతుకమ్మ పండుగకు భక్తి తోలుకాడ!
బ్రతుకమ్మ నాడేది పడతి నామల్లీ!

గుడిముందు బ్రతుకమను కుదురుగా తా నిలిపి
పదిమంది స్త్రీలతో భక్తితో చప్పటులు
కోలు కోలు అంటు కోటిపాటలు పాడు!

బ్రతుకమ్మ పండుగకు భక్తి తోలుకాడ
బ్రతుకమ్మ నాడేది పడతి నామల్లీ!

చద్దులా బ్రతుకమకు సాగిలా మ్రొక్కేది
పానకము, వడపప్పు, పాయసము, జున్నులతో
నైవేద్యములు పెట్టి నాట్యాలు చేసేది!

## చెలియ నీవా నాడు

చెలియ నీవానాడు చిగురు పువ్వాకులకు
నేర్పినా నేర్పులే నేవిందు నేడూ!

'మల్లి!' యని నేబిలువ 'మాలి!' యని నను బిలిచి
తీగ తీగకు నీరు తెచ్చి పోయించితివి!
రాణివై ఆనాడు రాజ్యమేలితివి గదే!

చెలియ నీవా నాడు చిగురు పువ్వాకులకు
నేర్పినా నేర్పులే నేవిందు నేడూ!

తీగ తీగకు జేరి చిగురు పువ్వాకులను
ఆటలను పాటలను ఆదరించితివి గదే!
ఆ ఆటపాటలే యలరుచున్నవి నేడు

చెలియ నీవానాడు చిగురు పువ్వాకులకు
నేర్పినా నేర్పులే నేవిందు నేడూ!

కొమ్మకు కొమ్మకు జేరి కోయంటు కూయంటు
వింత వింత ధ్వనులు వినిపితివి గదవే!
ఆధ్వనులె యీనాడు ఆక్రమించెను తోట

చెలియ నీవానాడు చిగురు పువ్వాకులకు
నేర్పినా నేర్పులే నేవిందు నేడూ!

ఆనాడు రాజునై అలరితిని తోటంత
ఈనాడు బీదనై వినుచుంటి కనుచుంటి!
చిగురు పువ్వాకులిట చెప్పేటి నీకథలు!

# సంక్రాంతి లక్ష్మి

సంక్రాంతి లక్ష్మి యిల సాగి ముందుకు రాగ
మల్లి మహాలక్ష్మి వలె వెల్లి విరిసేదీ!

సంక్రాంతి ముగ్గులను సఖియ వాకిలి దీర్చి
పసుపు కుంకుమలతో భక్తి గడపల మ్రొక్కి
గొబ్బెమ్మలను నిల్పి కూర్మి పూజించేది

సంక్రాంతి లక్ష్మి యిలసాగి ముందుకు రాగ
మల్లి మహాలక్ష్మి వలె వెల్లి విరిసేదీ।

ఇల్లు వాకిలి దీర్చి నిలవేల్పులను గొలుచు
బొమ్మ కొలువుల దీర్చి పూని హరిదాసులకు
నిండు దోసిళ్ళతో నివ్వాళు లిచ్చేది!

సంక్రాంతి లక్ష్మి యిల సాగి ముందుకు రాగ
మల్లి మహాలక్ష్మి వలె వెల్లి విరిసేదీ!

పుట్నాల గురుగులను పూని కన్యల కిచ్చు!
పటిక బెల్లాలతో బాలలను పులకించు!
తాంబూల ఫలములతో తరుణులను పూజించు!

సంక్రాంతి లక్ష్మి యిల సాగి ముందుకు రాగ
మల్లి మహాలక్ష్మి వలె వెల్లి విరిసేదీ!

పొలమంత కలదిరిగి పూని ధరణికి మ్రొక్కు
పంట లక్ష్మిని జూచు నింట లక్ష్మిగ వెలుగు
ఇల్లాలి తనమంత నింపుగా జూపేది!

# నా వేద నిది యనుచు

నా వేద నిది యనుచు నలుగురికి నే దెలుప
నా బాధలను నేను నమిలి మ్రింగెదనూ!

కలువ కన్నుల కోలికి
కదిలి నను వీడెనని
కలువ పూవుల జేరి కలత బొందనులే!

నా వేద నిది యనుచు నలుగురికి నే దెలుప
నా బాధలను నేను నమిలి మ్రింగెదను!

మెరుపు తీగల మేని
మెలత వేరై నదని
నీలి మబ్బుల జూచి నీరసింపనులే!

నా వేద నిది యనుచు నలుగురికి నే దెలుప
నా బాధలను నేను నమిలి మ్రింగెదను!

చంద్ర బింబపు మొగము
చాన వీడిన దనుచు
వెన్నెలా జేనితో విన్నవింపనులే!

నా వేద నిది యనుచు నలుగురుకి నే దెలుప
నా బాధలను నేను నమిలి మ్రింగెదను!

కంట నీటిని తేను
కలవరింపను సఖియ!
ఎడబాటు మంటలను నిమిడించు కొనియుందు!

# చందమామకు ఈడు

చందమామకు నీడు జోడే నా మల్లి!
అందమా నీ మొగము తీరే!

చంద్రబింబము బోలు
సఖియ నీ ముఖ శోభ
అని యెన్ని సార్లు నిన్నలరి హృది గ్రుచ్చితిని!

చందమామకు నీడు జోడే-నామల్లి
అందమా నీ ముఖము తీరే!

తెల్లనీ వెన్నెలల
తీరైన మిలమిలలు
నీమేని సొగసులకు నిండార సమములని!

చందమామకు నీడు జోడే-నా మల్లి
అందమా నీ మొగము తీరే!

చంద్ర కిరణములతో
సఖియ! నే పులకింతు!
నీ తనువు తాకుడుల నిలువునా పులకింతు!

చందమామకు నీడు జోడే-నామల్లి!
అందమా నీ మొగము తీరే!

అందాల మల్లేది?
చందాల వల్లేది?
అని పలుక జాబిల్లి అలరి నే నేమందు?

## ఇంతే గదే మల్లి!

ఇంతేగదే మల్లి! అంతేగదే!
నే జేసినా నేర మింతేగదే!

కన్నీరు తొలుకనని కలత నే బొందనని
బాస జేసితి నాటి ప్రతిన దప్పితినా?
నాలోనె నే కుమిలి నలుగు చుంటినిగాని!

ఇంతేగదే మల్లి! అంతేగదే!
నే జేసినా నేర మింతే గదే!

పాలేటి తరగలను పడతి నీ నవ్వులంటు
కలయ జూచుచు బయలు కనులు నింపితి నంతే!
కన్నీరు తొలికెనా? కాలువలు గట్టెనా?

ఇంతేగదే మల్లి! అంతే గదే!
నే జేసినా నేరమింతే గదే!

చందమామను జూచి సఖియ నీ మొగమంచు
జాలిగా జూచుచు జలదరించితి నంతే!
వేదనను వివరించి విప్పి జెప్పితినా?

ఇంతేగదే మల్లి! అంతేగదే.
నే జేసినా నేరమింతే గదే!

కోకిలలు పాడగా కూడగట్టితి మనసు
చిలుక పలుకగ మదిని నిలువరింపగ లేద?
కన్నీరు నాపితిని కలత నుసి జేసితిని!

## తానొకటి తలపగా

తా నొకటి తలపగా దైవమొకటించే!
ఒకటి చేయగ నీవు ఒకటాయె చెలియా!

చిలుక కోకిలలకూ పలుకు పాటల నేర్పి
నా వేదనల మాన్ప నాతి సెలవిచ్చితివి!
చిలుక కోకిలలె నను చిత్రవధ చేసినవి!

తా నొకటి తలపగా దైవమొకటించే!
ఒకటి చేయగ నీవు ఒకటాయె చెలియా!

చిలుక పలుకులు నీదు చిరకాల కథ లగును!
కోకిలా పాటలగు కోమలీ నీ చరిత!
మధుర స్మృతులను తెచ్చి మాడ్చివేయును చెలియ

తా నొకటిగా తలపగా దైవమొకటించే
ఒకటి చేయగ నివు ఒకటాయె చెలియా!

మంచెపై రా చిలుక మధురవాక్కులు బలికె
కొమ్మపై కూర్చుండి కూయంటు కోకిలా
అంపమున కోయుమది రవ్వరట్టులేక!

తా నొకటి తలపగా దైవమొకటించే!
ఒకటి చేయగ నీవు ఒకటాయె చెలియా!

వేదనల మాన్పుచున, వేదనల రెట్టించె
నా దుఃఖ మధికమై నదులయ్యె కన్నీరు!
రోదనల ధ్వనులతో రోదసీ నిండెనే?

## చివరి పాటిదె!

చివరి పాటిదె యింక చెలియ పాడను లే!
అలరి నే నిక నిన్ను కలవరింపను లే!

వెన్నెలా రాత్రులను
తిన్నెలను జతగూడి
విహరించినా క్షణము లిహ ఇంక రావు లే!

చివరి పాటిదె యింక చెలియ పాడను లే!
అలరి నేనిక నిన్ను కలవరింపను లే!

కొసరి మన మురువురము
కోయిలతో జతగూడి
పాడినా పాటలిక పడతి మరి రావు లే!

చివరి పాటిదె యింక చెలియ పాడను లే!
అలరి నేనిక నిన్ను కలవరింపను లే!

పొలములో పనిచేసి పొసగి కేరింతలతో
ప్రేమతో మనమింక
పెనగు టిక లేదు లే!

చివరి పాటిదె యింక చెలియ పాడను లే!
అలరి నే నిక నిన్ను కలవరింపను లే!

నీ తలపులింక నే
నిలుపు చుంటిని చెలియ!
మూగినై మూర్తినై మునిగ మారుచునుంటి!

## ఎచటుంటివని యడుగ?

ఎచటుంటివని యడుగ నేమందునే? నీదు
చెలులంత యడుగ నేనే మందునే?

పలుకు నేర్చిన చిలుక
పరగ నాదరి జేరి
మల్లెచ్చటున్నదన మాటేమి పలుకుదును?

ఎచటుంటివని యడుగ నేమందునే? నీదు
చెలులంత యడుగ నే నేమందునే?

పాడుతూ కోకిలా
పరవశేముతో వచ్చి
మల్లెదియని యడుగ మదిపొంగ నేమందు?

ఎచటుంటివని యడుగ నేమందునే? నీదు
చెలులంత యడుగ నే నేమందునే?

నీ వళుల యందములు
నీటుగా నేర్చినా
నది కన్య లడుగగా నాతి! నే నేమందు?

ఎచటుంటివని యడుగ నేమందునే? నీదు
చెలులంత యడుగ నే నేమందునే?

నీ చెలులు ననుజుట్టి
నీ జాడ లడుగగా
నింగి చుక్కల జూపి నింపుదును కన్నీరు!

# జన్మజన్మల నాటి

జన్మ జన్మలనాటి జంట వీడిందీ!
మర్మముగ తన బొమ్మ మరుగు జేసిందీ!

పెనుకున్న తరువును ప్రేమగను విదిలించి
చిన్నారి చివురులను చిట్టిపూవుల నొదిలి
పాలేరు తరగలలొ పయనమై పోయింది!

జన్మల జన్మలనాటి జంట వీడిందీ!
మర్మముగ తన బొమ్మ మరుగు జేసిందీ!

మనసార జూచింది మగువ నా కళ్ళలో
మళ్ళి వస్తా ననుచు మాటకే జెప్పింది!
మరు జన్మకని దాని మాటకర్థమొ యేమొ!

జన్మ జన్మలనాటి జంట వీడిందీ!
మర్మముగ తన బొమ్మ మరుగు జేసిందీ!

చెలి కనులు చెలి వళులు చెలి కటిని నే జూచి
తా నదే కన్నెయని తనివార వీక్షింతు!
తన తల్లి యొడియందు తా నొదిగె కాబోలు!

జన్మ జన్మలనాటి జంట వీడిందీ!
మర్మముగ తన బొమ్మ మరుగు జేసిందీ!

కాఱు మబ్బున చంద్రకళవోలె నే నుంటి
గాలిలో దీపముగ కదులుచుంటిని క్షణము!
నా విరహ యాత్రలో నావ యెటు బోవునో!

## దరిలేని వేదనల

దరిలేని వేదనల ద్రవమాయె మది మల్లి!
జల జలా పారేటి ఝురి యాయెనే!

గొంతెత్తి ఏ మాట
కోరి నే పలికినా!
నీ తోడ పలికినటు నే పులకరిస్తాను!

దరిలేని వేదనల ద్రవమాయె మది మల్లి!
జల జలా పారేటి ఝురియాయెనే!

ఏ పాట పాడినా
ఎదురుగా నీ వుండి
కలకలా నీ గొంతు కలిపినట్లుంటాది!

దరిలేని వేదనల ద్రవమాయెనే మల్లి!
జల జలా పారేటి ఝురి యాయెనే!

మల్లి పందిరి క్రింద
మగువ నే రోదింప
నీ రోదన ధ్వనుల నే విందు నా జతగ!

దరిలేని వేదనల ద్రవమాయెనే! మల్లి!
జల జలా పారేటి ఝురి యాయెనే!

అందుకే ఏ మాట లాడనిక! పాడనిక!
కన్నీరు తోడుకుచు కథల మది దలప నిక!
శిలగ నే మారెదను చిత్రముగ పాలేట!

## పాలేరు పొంగేది

పాలేరు పొంగేది పరవళ్ళుగా–మల్లి
పాదాలు కదిలేవి ఘలు ఘల్లునా!

పాలేటి పాటలకు పరవశించిన మల్లి
ఆటుపోటులచిందె యలరు జలధికి వోలె
అందెలూ ఘల్లనగ నా మల్లీ
చిందేది నాట్యాలు నా మల్లీ

పాలేరు పొంగేది పరవళ్ళుగా మల్లి
పాదాలు కదిలేవి ఘలు ఘల్లునా!

పాలేటి పాటలతో పల్లవిని కలుపుతూ
స్నేహ గీతాలతో చిరునగవు చిందగా
వనవీధి పక్షులే పాడేవి!
వన మయూరము లన్ని యాడేవి!

పాలేరు పొంగేది పరవళ్ళుగా!–మల్లి
పాదాలు కదిలేవి ఘలు ఘల్లునా!

వంపులతో పాలేటి సొంపులను జతజేసి
కదిలేటి యలలవలె కరచాలనము జేసి
లయతాళ గతులతో నా మల్లీ!
లాలిత్య మొలికేది నా మల్లి!

పాలేరు పొంగేది పరవళ్ళుగా–మల్లి
పాదాలు కదిలేవి ఘలు ఘల్లునా?

# ఆనాటి పాలేరె!

ఆనాటి పాలేరె! ఆనాటి చిఱుతరగ
లానాటి యిసుకపొర లానాటి శిలలే!

ఆనాటి పాలేటి యాచిన్ని తరగలే
కనుల కానందమును గలిగించి మెత్రిసేవి
అదియంత నేడు నా కగుపించు నుసిమసిగ!

ఆనాటి పాలేరె! ఆనాటి చిఱుతరగ
లానాటి యిసుకపొర లానాటి శిలలే!

పాలేటిలో శిలలు పసిడిబొమ్మల మల్లె
మధుర మూర్తులవోలె మనసు కగుపించేవి!
కఠిన శిల లనిపించు కనుల గఱమను నేడు!

ఆనాటి పాలేరె! ఆనాటి చిరుతరగ
లానాటి యిసుకపొర లానాటి శిలలే!

ఆనాటిపాలేటి అందాల రాగాలు
ఆనాటి సొగసంత అడవిలా గనిపించు!
మల్లిలేనీ నాకు మరుభూమిగా దోచు!

ఆనాటి పాలేరె! ఆనాటి చిరుతరగ
లానాటి యిసుకపొర లానాటి శిలలే!

## ఏనోము పున్నెములు

ఏనోము పున్నెములు ఏ పూజ ఫలములు
మల్లి! నీ యాపదను మాన్ప లేదుగదా!

అగుపడిన దేవతల నట్టె పూజించావు
కనబడిన తీర్థముల గాంచి సేవించావు
ఆ దేవతలు నీకు అడ్డురాలేదు చెలి!

ఏనోము పున్నెములు ఏపూజ ఫలములు
మల్లి ని యాపదను మాన్ప లేదుగదా!

పేదసాదల కరుణ ప్రీతితో జూచావు
పిన్నలకు పెద్దలకు ప్రేమ విరజిమ్మావు
ఆ పున్నెములు నీకు అడ్డు రాలేదు చెలి!

ఏనోము పున్నెములు ఏ పూజఫలములు
మల్లి! నీ యాపదను మాన్ప లేదుగదా!

పూ మొక్కలన్ని నీ బిడ్డలై పెరిగినవి
ఫలవృక్షములు నీదు బంగారు కొమరులై
అలరుచున్నవి చెలియ! అందాల మనతోట!

ఏ నోము పున్నెములు ఏ పూజఫలములు
మల్లి నీయాపదను మాన్ప లేదుగదా!

విధి వ్రాత కాబోలు! ఎదిరింప మన తరమ?
జరుగ వలసినదంత జరిగినది ప్రియసఖీ!
మన ప్రేమ చేదాయె! మన మనసు లెడమాయె!

## మనసు లొకటైనాము

మనసులొకటైనాము తనువులొకటైనాము
నీవున్న నాలోన నేను మఱి లేను
నీవున్న నాలోన నేను మఱి లేను!

గంగ యమునా నదుల కలయికల మాదిరిగ
కృష్ణ మూసీ జలల కూడికలవోలె
మన మనసులొక్కటై మలుచుకున్నవి చెలియ!

మనసు లొకటైనాము తనువులొకటైనాము
నీవున్న నాలోన నేను మఱి లేను!

నింగిమబ్బులు రెండు నిలిచి ఒకటైనట్లు
మల్లెమాలతి తీగె అల్లుకున్నట్లుగా
తనువులొకటైనాము తన్మయము పొందాము!

మనసులొకటైనాము తనువు లొకటైనాము
నీవున్న నాలోన నేను మఱి లేను!

మనసులో మనసుంచి తనువులో తనువుంచి
పాలేటితరగల్లొ పయనమైపోయాము
నీబొమ్మ నను విడదు నీలి రంగుకు మల్లె!

మనసులొకటైనాము తనువులొకటైనాము
నీవున్న నాలోన నేను మఱి లేను!
నీవున్న నాలోన నేను మరి లేను!

# రంగులేని బొమ్మ

రంగు లేనీ బొమ్మ నవరసము లెటు లొలుకు?
చెలి లేని బ్రతు కెటుల చిగురించు నింకా।

జారినా పువ్వటుల సఖియ వేరై తిపి!
తొడిమలా నే నిలిచి తూలుచుంటిని సఖియ!
చైతన్యమే లేని జీవమెటు శోభించు!

రంగు లేనీ బొమ్మ నవరసము లెటు లొలుకు?
చెలి లేని బ్రతు కెటుల చిగురించు నింకా!

పెనుగాలి తాకిడికి ప్రిదిలి యటు నిటునూగి
ఆకుపూవులు రాలు అడలు తరువుగ నుంటి.
అతివ! అలనాటి మా అందాలు ఎటు బోయె?

రంగు లేనీ బొమ్మ నవరసము లెటులొలుకు
చెలి లేని బ్రతుకెటుల చిగురించు నింకా?

మబ్బుకమ్మిన రేయి మాదిరిగా నేనుంటి
నీరు విడిచిన చేప నిండు వేదన నైతి
కనుచూపు మేరంత కారుచీకటి సఖి!

రంగు లేని బొమ్మ నవరసము లెటులొలుకు
చెలి లేని బ్రతు కెటుల చిగురించు నింకా!

ముత్యాలు దండ తెగి ముళ్ళలో రాలినవి
రాలినా ముత్యాలు రాళ్ళ పాలాయె నే
శూన్యమా దారముతో స్రుక్కుచుంటిని చెలీ।

# కన్నీరు నొలుక నిక

కన్నీరునొలుక నిక కలతబా టొందనిక
బంధుమిత్రుల యెదుట పడతి! నిను దలపా!

రగిలేటి నా గుండె రవలు బయటికి తేను!
పగిలేటి నా మనసు బాధ వెలికి తేను!
నాలోనె నే కుమిలి నలిగి పోయెదనింక!

కన్నీరునొలుక నిక కలతబాటొంద నిక
బంధుమిత్రుల యెదుట పడతి! నిను దలపా!

క్రమ్మేటి కన్నీరు కనులలో సింకింతు!
అదిరేటి ముకుపుటల హద్దులో నుంచెదను!
'హా! చెలీ!' అను పలుకు లన నింక పలుమాఱు

కన్నీరు నొలుక నిక కలతబా టొందనిక
బంధుమిత్రుల యెదుట పడతి! నిను దలపా!

ఒంటరిగ పాలేటి యొడ్డులను దిరుగ నిక
మంచెపై నెక్కి యికి 'మల్లి!' యని బిలువనే!
కొలనితామర జూచి కూడి రోదింపనే!

కన్నీరు నొలుక నిక కలత బాటొందనిక
బంధుమిత్రుల యెదుట పడతి! నిను దలపా!

పిన్న పెద్దలు జేరి 'పిచ్చివా' డనిరి నను
జగమెఱుగునా సఖి! జన్మ జన్మాలకథ?
తనువులూ వేరనీ, తగ మనసు లొకటనీ!

## మల్లే కావాలి!

మల్లే కావాలి! చెలు
మల్లే కావాలి!

ఎన్ని పూలు పూదోటను విరిసిన
వన్నెలాడి నామనసుకు నచ్చిన

మల్లే కావాలి! చెలు
మల్లే కావాలి। ...మల్లే

చంపక జాజీ మాలతీ జలజ
చామంతుల నే జేర నొల్లను
సన్నని కలువల సోగ కన్నులతో
సర్వస్వమును దోచుకున్న ఆ ...మల్లే

సుందర రూపము సురుచిర కాంతులు
సుగంధ లహరుల సొగసు క త్తియలు
వన్నెలు చిన్నెల నెన్నిజూపినను
ఎన్నిక జేయను మల్లిని దప్ప ...మల్లే

ఆణిముత్తెమో దివి యచ్చరయో
అమృతమధనమున మోహిని మూర్తియొ
వెన్నెల నురుగుల ప్రాణ నెచ్చెలియొ
పన్నగజేసిన స్ఫటిక శిల్పమో! ...మల్లే

మనసున నిలిచిన మధుర చిత్రముగ
గొంతున కదిలే కోమల గీతిగ!
కన్నుల మెదిలే కావ్య స్వప్నముగ
కలకాలము నా మదిలో మెదిలే! ...మల్లే

# ఎందుకే కోకిలా ?

ఎందుకే కోకిలా ఆ పాటలూ!
ఎందుకే ఓ చిలుక ఈ మాటలూ!

ఆ పాట లామాట లామల్లి దగ్గరే
అలరి నేర్చినవన్ని అన్ని నే నెఱుగుదును!
క్రొత్తవనములు జూప కోర్కె మీ కెందుకే?

ఎందుకే కోకిలా ఆ పాటలూ!
ఎందుకే ఓ చిలుక ఈ మాటలూ!

కొండకోనలు తిరిగి కొసరి చివురులు దెచ్చి
మల్లి శిగలో తురిమి మధురిమలు నేర్చావు
కోకిలా! నీ గుట్టు కొసవఱకు నెఱుగుదును!

ఎందుకే కోకిలా ఆ పాటలూ!
ఎందుకే ఓ చిలుక ఈ మాటలూ!

తీయనీ పండ్లనూ తీరుగా రుచిచూచి
మల్లి కర్పణజేసి మాటలే నేర్చావు!
తెరమఱుగు కథలన్ని తెలుసులే ఓ చిలుక!

ఎందుకే కోకిలా ఆ పాటలూ!
ఎందుకే ఓ చిలుక ఈ మాటలూ!

ఆ మల్లి పాటలే ఆ మల్లి మాటలే
అన్ని నే విన్నవే! ఆ మల్లి పలికినవె!
ప్రాత పాటలు పాడి ప్రాణాలు తీయకుడు!

# చీకటిని నను ముంచి

చీకటిని నను ముంచి చిరసౌఖ్య మొందావు!
విలపించు చుంటి చెలి! వేయి గొంతులతో!

రగిలినా మనసుతో
పగిలినా గుండెతో
నిను పిలిచినా పిలుపు నింగిచుక్కల దాకె!

చీకటిని నను ముంచి చిరసౌఖ్య మొందావు
విలపించు చుంటి చెలి! వేయిగొంతులతో!

పాలేరు నను జూచి
పరుగు పరుగున బోవు
శిలలన్ని తలలొంచు చిఱుమీను లదిరిపడు!

చీకటిని నను ముంచి చిరసౌఖ్య మొందావు
విలపించు చుంటి చెలి! వేయి గొంతులతో!

ఏటిదరులూ రెండు
చాటుగా రోదించు!
ఇమ్ముగా నిసుకపొర చెమ్మగిల్లును సఖియ!

చీకటిని నను ముంచి చిరసౌఖ్య మొందావు
విలపించుచుంటి చెలి! వేయి గొంతులతో!

చందమామను విడిచి చల్లగాలుల నొదిలి
పాలేటి కగపడక పక్షులకు కనబడక
శిలల చాటున జేరి చింతించుచుంటి సఖి!

# ఒంటరిగ పాలేటి

ఒంటరిగ పాలేటి ఒడ్డునకు రాగా
'హా సఖా!'యని నన్ను అఅచి పిలిచేవ్వా!

నలుదెసల పరికింతు
నాతి! నిను కనుగొనగ
శిరమెత్తి వినువీధి చేర రావే యందు!

ఒంటరిగ పాలేటి ఒడ్డునకు రాగా
'హా సఖా!' యని నన్ను అఅచి పిలిచేవ్వా

శిలల చాటున నుండి
చేర బిలిచితి నను మ!
శిల్పివలె నెపకును జేరుదును శిలశిలను!

ఒంటరిగ పాలేటి ఒడ్డునకు రాగా
హా సఖా! యని నన్ను యఅచి పిలిచేవ్వా!

పాలేటి మలుపులలో
ప్రవహించు జాలులలో
వినదించు నాదమును నీదె యని భ్రమయింతు!

ఒంటరిగ పాలేటి ఒడ్డునకు రాగా
హా సఖా! యని నన్ను యఅచి పిలిచేవ్వా

నీటి పక్షులలోన నీవుంటి వనిజూతు
గాలి సవ్వడులలో కలిసుంటి వని యెంతు
నలుదెసల నిను జూతు నాతి! గుండెలు పగుల!

# మనసులో మనసుగా

మనసులో మనసుగా తనువులో తనువుగా
కలిసియుంటిమి నాటి కథలన్ని ముగిసే!

పూవులో తావిగా
చివురులో తళుకులా
వెన్నెలల వెలుగులా వెలసియుంటిమి నాడు !

మనసులో మనసుగా తనువులో తనువుగా
కలిసి యుంటిమి నాటి కథలన్నీ ముగిసే!

చెట్టు పట్టాలతో
చేనంత తిరుగుతూ
గువ్వజంటకు మల్లె కులికితిమి గదవే!

మనసులో మనసుగా తనువులో తనువుగా
కలిసి యుంటిమి నాటి కథలన్నీ ముగిసే!

చిత్ర చిత్రములుగా
చిలుకలతో పలికితిమి
కోకిలతో మన మపుడు కూడి పాడతిమిా!

మనసులో మనసుగా తనువులో తనువుగా
కలిసి యుంటిమి నాటి కథలన్నీ ముగిసే!

పాలేటి ఇసుకలో పరుగు లేమాయెనో!
కంది చేనిలోని కథ లెటుల బోయెనో!
గతమంత కళ్ళలో కట్టినట్టుంటాది!

## చెలి పలుకులే నాకు

చెలి పలుకులే నాకు కర్ణామృతం-మళ్లి
పులకింపులే నాకు జీవామృతం!

వాడి పోయిన మనసు
వన్నెలను పొందేది!
మలినమైనా మనసు మధురిమలు చిందేది!

చెలి పలుకులే నాకు కర్ణామృతం-మళ్లి
పులకింపులే మదికి-జీవామృతం!

సకలేంద్రియములకు
సంతసము గలిగించి
ఆనంద వారిధిని నటు తేలవేసేవి!

చెలి పలుకులే నాకు కర్ణామృతం!-మళ్లి
పులకింపులే మదికి-జీవామృతం!

చెలిలేని నా మనసు
చిమ్మ చీకటి యాయె!
సుడులలో తిరిగేటి పడవాయె నా బ్రతుకు!

చెలి పలుకులే నాకు కర్ణామృతం-మళ్లి
పులకింపులే మదికి జీవామృతం!

నీ పలుకు వినబడమ
నా పలుకు మూగవడె!
చైతన్యమే లేని జడజీవి నే నిపుడు!

చెలి పలుకులే నాకు కర్ణామృతం!-మళ్లి
పులకింపులే మదికి జీవామృతం!

## పాలు ముట్టీ

పాలు ముట్టీ నాడు ప్రతిన జేశామూ
పచ్చనాకును బట్టి బాస చేశామూ!
కంటిరెప్పల మల్లె
జంట విడి పోమనుచు
గుడి దేవునీ ముందు గుట్టుగా పలికాము!
పాలు ముట్టీ నాడు ప్రతిన జేశామూ!
పచ్చ నాకును బట్టి బాస చేశామూ!
నీకు నాకు సాక్షి
నిండు చందురు డనుచు
వెన్నెల్ల బయలులో వివరంగ పలికాము!
పాలు ముట్టీ నాడు ప్రతిన జేశామూ!
పచ్చ నాకూ బట్టి బాస చేశామూ!
ఈ గున్న మామిడీ
ఈ మల్లె పొద మనకు
మధ్యవర్తు లనుచు మర్మముగ పలికాము!
పాలు ముట్టీ నాడు ప్రతిన చేశామూ!
పచ్చ నాకును బట్టి బాస చేశామూ!
బాసలన్నీ జేర
పాలేటి తరగల్లో
జంట విడిపోయాము! ఒంటి నను జేశావు!
పాలు ముట్టీ నాడు ప్రతిన జేశామూ!
పచ్చ నాకును బట్టి బాస చేశామూ!

## మనసు బరువును

మనసు బరువును మోయలేనే? ఓ మల్లి!
మనసు వెన్నెల జేయలేనే!

అల్లి బిల్లిగ మనసు
అల్లుకున్నావు గదె!
మల్లె పూవాసనల మదినంత నింపావు!

మనసు బరువును మోయలేనే! ఓ మల్లి
మనసు వెన్నెల జేయలేనే!

చందమామకు మల్లె
చల్లగా తెల్లగా
తియ్యగా మనసంత తీపిగా జేశావు!

మనసు బరువును మోయలేనే! ఓ మల్లి
మనసు వెన్నెల జేయలేనే!

మల్లె తీగే వాడె
చెల్లె! నా కోరికలు
చందమామా మాసె చల్లదనములుమాసె!

మనసు బరువును మోయలేనే!–ఓ మల్లి
మనసు వెన్నెల జేయలేనే!

మనసు కుంపటియాయె
మది చీకటులు క్రమ్మె
బ్రతుకలేకా నేను బ్రతుకుచుంటిని సఖీ!

## ఒకనాటి కథలన్ని

ఒకనాటి కథలన్ని ఇంకెందుకే! మల్లి !
ఒకనాటి ముచ్చట్లు ఇంకెందుకే!

అవతలొడ్డున నీవు ఇవతలొడ్డున నేను
ఓ యనగ ఓ యంటు ఒప్పగా గొంతెత్తి
పాలేటి ఒడ్డునా పాటలే పాడాము!

ఒకనాటి కథలన్ని ఇంకెందుకే! మల్లి
ఒకనాటి ముచ్చట్లు ఇంకెందుకే!

ఏఱు గలగలమంటు ఈలలేస్తుంటేను
పండు వెన్నెల్లోన పాలేటి తిన్నెల్లొ
గుండె గుండెను కలిపి గుసగుసల నాడాము!

ఒకనాటి కథలన్ని ఇంకెందుకే మల్లి
ఒకనాటి ముచ్చట్లు ఇంకెందుకే!

ఏటి మోతల కలిపి పాటలే పాడాము
నీటి తరగల మల్లె ఆటలే ఆడాము
సుడులవలె చుట్టుకుని తుళ్ళింత లేశాము!

ఒకనాటి కథలన్ని ఇంకెందుకే మల్లి
ఒకనాటి ముచ్చట్లు ఇంకెందుకే!

సింగారములుపోయె చిఱునవ్వులంతమాయె
జంట విడి ఒంటినై కంటినీరే మిగిలె
కాఱు చీకటిలోన కథ నడుపుచుంటి చెలి!

## ఇతర గ్రంథములు

| | | | |
|---|---|---|---|
| 1. | నాలో వెలిగే దీపాలు [బాలల పండుగ] | 0 | 50 |
| 2. | విజయ మంగళమ్ [మధురభక్తి గీతములు] | 4 | 00 |
| 3. | ఆనంద మంగళమ్ ,, | 4 | 00 |
| 4. | ఉత్తర గోగ్రహణము [నాటిక] | 2 | 00 |
| 5. | నాట్యశాల [నాటిక] | 4 | 00 |
| 6. | భారతకోకిల సరోజినీదేవి - నవయుగనిర్మాత శ్రీ కందుకూరి [బుఱ్ఱకథలు] | 2 | 00 |
| 7. | [illegible] న కోడలు [సాంఘిక నాటిక] | 2 | 00 |
| 8. | [illegible] [సాంఘిక నాటిక] | 2 | 50 |
| 9. | [illegible] | 1 | 50 |
| 10. | [illegible] | 4 | 00 |
| 11. | [illegible] తల్లి [పాటలు] | 5 | 00 |
| 12. | [illegible] [గేయ కవితా సంపుటి] | 4 | 00 |



ప్రతులకు:
పి. దుర్గారావు, యం. ఓ. యల్.,
చెరుకుపల్లి పోష్టు,
(వయా) నక్రేకల్, నల్లగొండజిల్లా.